

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక- 28

## (శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி)



శ్రీరామచంద్రమూర్తి, రామతీర్థం



'పండితరత్న'
డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

శ్రీమతే రామానుజాయ నమః

# విజ్ఞాపనమ్

వేదభూమి అయిన మన భారత దేశంలో అనాదిగా ప్రవర్తించిన వైదిక సిద్ధాంతాలకు అన్నిటికీ పరమ ప్రమాణం వేదం. మిగిలిన ప్రమాణాల ప్రామాణ్యం అంతా కూడా, అవి వేదతత్త్వాలకు అవిరోధంగా ఉన్నప్పుడే అది వైదికులచే అంగీకరింపబడుతుంది. "ఆథౌ వేదాః ప్రమాణమ్"అని శ్రీపరాశర భట్టర్ దీనిని తెలియజేశారు.

వేదంలోని అర్థాలను వివరించే ఇతిహాస పురాణాలకు ఉపబృంహణాలు అని పేరు. "ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" (ఇతిహాసాల పురాణాల సహాయంతో వేదాలను వివరించాలి) అనేది శాస్త్ర సూక్తి. అప్పుడే వేదతత్త్వాలను స్పష్టంగా, నిర్దుష్టంగా గ్రహించగలిగే అవకాశం కలుగుతుంది.

ఇతిహాసాలు రెండు. వాటిలో మొదటిది, శ్రీరామాయణం, రెండవది మహాభారతం. ఈ రెండు కూడా వేదాలకు ప్రతిరూపాలుగానే వైదికులు భావిస్తున్నారు. ఈ రెండిటిలో కూడా, శ్రీరామాయణానికి అధిక ప్రామాణ్యాన్ని మన పూర్వాచార్యులు అంగీకరించారు. వేదవేద్యుడైన పరమాత్మ దశరథ పుత్రుడై శ్రీరాముడై అవతరించగా, ఆ పరమాత్మ తత్త్వాన్ని తెలియజేసే వేదం శ్రీరామాయణంగా అవతరించింది – అనే విషయాన్ని.

**"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,**
**వేదః ప్రాచీతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"**

అనే పౌరాణిక సూక్తి తెలుపుతున్నది. శ్రీరామాయణంలో అంతా వేదార్థాలు ఇమిడి ఉన్న విషయాన్ని వైదికులు అందరూ అంగీకరించారు, తమ తమ సంప్రదాయాలకు అనుగుణంగా సమన్వయించి, వాటిని వివరించారు కూడా.

## శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி

సామాన్యులకు దురవగాహాలైన వేద తత్త్వాలను ప్రాంతీయమైన ద్రావిడ భాషలో, మధురమైన ద్రావిడ ప్రబంధ రూపాలలో మలచి, లోకానికి అందించిన మహనీయులు – ఆళ్వారులు. వీరు అనుగ్రహించిన ప్రబంధాలు 24. వీటిలో నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువందాది, తిరువాయ్ మొళి(ழி) అనే నాలుగు ప్రబంధాలు నాలుగు వేదాలుగా మన పూర్వాచార్యుల చేత అంగీకరింపబడ్డాయి. ఋగ్వేద సారంగా తిరువిరుత్త ప్రబంధాన్ని, యజుర్వేద సారంగా తిరువాశిరియ ప్రబంధాన్ని, సామవేద సారంగా తిరువాయ్ మొళి(ழி) ప్రబంధాన్ని, అధర్వణ వేద సారంగా పెరియ తిరువందాది ప్రబంధాన్ని ఆచార్యులు భావించారు. "వేదానాం సామవేదోస్మి" అని సాక్షాత్తు గీతాచార్యుడు తన విశేషమైన విభూతిగా సామవేదాన్ని గీతలో పేర్కొన్నాడు. ఈ క్రమంలోనే సామవేద సారంగా భావింపబడే తిరువాయ్ మొళి ప్రబంధాన్ని కూడా మన పూర్వాచార్యులు భగవంతుని విశేషమైన విభూతిగా భావించారు. అందువల్ల మిగిలిన ప్రబంధాల కంటే ఈ బంధానికి ఒక విలక్షణమైన స్థానం ఉన్నది.

ఈ ప్రబంధంలోని పాశురాలను వ్యాఖ్యానించే సర్వజ్ఞులైన మన పూర్వాచార్యులు ఆ యా సందర్భాలకు తగినట్లుగా పాశురాలలో భాసించే అర్థాలకు, శ్రీరామాయణ శ్లోకాలలో ప్రకాశించే అర్థాలకు మధ్య ఉండే అర్థసామ్యాలను చాలా మనోహరంగా నిరూపించారు. ఈ విధంగా వారు ఈ రెండు గ్రంథాల మధ్య ఉండే అర్థైకకంఠ్యాన్ని నిరూపించడం వల్ల ఉభయ వేదాంతైకకంఠ్యం నిరూపింపబడడమే కాకుండా, మన పూర్వాచార్యుల సునిశితమైన పరిశీలనా దృష్టి కూడా నిరూపింపబడినది. ఈ విధంగా ఈ రెండు గ్రంథాల మధ్య ఉండే అర్థసామ్యాలు ఒకచోట, రెండు చోట్ల మాత్రమే కాదు, కొన్ని వందల సందర్భాలలో వారు నిరూపించారు. శ్రీరామాయణంలోని సంప్రదాయ విశేషార్థాలను శ్రీశైల పూర్ణులు అనబడే

తిరుమలనంబి భగవద్రామానుజుల వారికి ఒక సంవత్సర కాలం ఉపదేశించినట్లుగా శ్రీరామానుజుల చరిత్ర తెలుపుతున్నది. ఈ అర్థాలు అన్ని నాథమునుల కాలం నుండి పరంపరగా అందినవే తప్ప, స్వకపోల కల్పితాలు కావు. శిష్యాచార్య పరంపరాక్రమంలో రక్షింపబడుతూ వచ్చిన ఈ విశేషార్థాలను నంబిళ్ళై, పెరియ వాచ్చాన్ పిళ్ళై మొదలైన పూర్వాచార్యులు దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో ప్రస్తావించడం ద్వారా వాటిని గ్రంథస్థం చేసి, వాటికి శాశ్వతత్వాన్ని కలుగజేశారు. అందువల్ల, ఈ మధురమైన విశేషార్థాలను ఈనాటికీ మనం అనుభవించ గలుగుతున్నామంటే, దానికి కారణం, విశాల హృదయులైన మన పూర్వాచార్యులే. శ్రీరామాయణాన్ని సంస్కృతంలో శ్రీరామానుజ సిద్ధాంత సంప్రదాయపరంగా వ్యాఖ్యానించిన గోవిందరాజాచార్యుల వారు కూడా తమ వ్యాఖ్యానంలో కొన్ని విశేషార్థాలను సంస్కృతీకరించి, విశ్వవ్యాప్తం చేశారు.

ఈ అర్థసామ్యాలు యథామతి కొన్ని విజ్ఞాపింపబడతాయి. ముందుగా బాలకాండలో ఉండే కొన్ని శ్లోకాలకు, తిరువాయ్ మొళి ప్రబంధసూక్తులకు మధ్య ఉండే సామ్యాలను గమనిద్దాం.



# శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி – 1

★★★★

## బాలకాండం

1. కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ |
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥ (1-2)

ఓ మునిపుంగవా! నారదా! ప్రస్తుతం, ఈ లోకంలో, సకలప్రశస్తగుణ సంపన్నుడు (శీలగుణసంపన్నుడు), వీర్యగుణాన్ని కలిగినవాడు, ధర్మాన్ని తెలిసినవాడు, కృతజ్ఞతా గుణాన్ని కలిగినవాడు, సత్యవాక్య పరిపాలనా వ్రతుడు, ఏ కాలంలోనూ చెరగని దృఢమైన సంకల్పం కలిగినవాడు ఎవడు ఉన్నాడు?– అని వాల్మీకి మహర్షి నారదుని ప్రశ్నించాడు.

ఈ శ్లోకంలోని "గుణవాన్" అనే ప్రయోగాన్ని రెండు విధాలుగా పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. సకల కళ్యాణ గుణాలను కలిగినవాడు– అనేది మొదటి అర్థం. ఇది, " భూమ నిందా ప్రశంసాసు–– భవంతి మతుబాదయః" అనే శాస్త్ర క్రమాన్ని బట్టి చెప్పబడింది. దీనిని బట్టి ఇక్కడ, గుణ శబ్దంపైన వచ్చిన మతుప్ ప్రత్యయం ద్వారా " – అన్ని విధాలయిన మంచి గుణాలను కలిగినవాడు" – అనే మొదటి అర్థం. భాసిస్తున్నది. వేదాంతాలలో కూడా భగవానుడు సకల కళ్యాణ గుణాకరుడుగా కీర్తింపబడుతున్నాడు. " నాంతం గుణానాం గచ్ఛంతి, తేనానంతః" (భగవంతుని గుణాలకు అంతు లేదు గనుక అతడు అనంతుడు అని అనబడుతున్నాడు) అనే అనంతనామ నిరుక్తి భగవంతుని సకల కళ్యాణ సంపన్నతను చెబుతున్నది.

ఈ విధంగా వేదాంత ప్రక్రియలో, భగవంతుని అసాధారణ నిరూపక ధర్మాలుగా చెప్పబడే ఉభయ లింగాలలో ఒకటైన, సకల కళ్యాణ గుణాకరత్వాన్ని చెప్పిన తరువాత, , శ్రీరామావతారానికి అసాధారణ

గుణమైన శీలం అనే గుణాన్ని కలిగినవాడు– అనే అర్థాన్ని ఈ "గుణవాన్" అనే పదానికి మన పూర్వాచార్యులు చెప్పారు. " గుణ్యతే ఆవర్త్యతే పున పునః ఆశ్రితైరనుసంధీయతే ఇది గుణః, సౌశీల్యమ్" (మాటిమాటికి భక్తుల చేత అనుసంధింపబడుతున్నది కనుక, సౌశీల్యం అనే గుణం గుణ శబ్దం చేత చెప్పబడుతున్నది) అనే గుణ శబ్ద నిరుక్తిని ఆధారంగా చేసుకుని, ఇక్కడ గుణ శబ్దానికి శీలపరంగా అర్థాన్ని గ్రహించారు. " గుణస్త్వావృత్తి శబ్దాది––" అని విశ్వనిఘంటువు గుణ శబ్దానికి "మాటిమాటికి అనుసంధించడం" అనే అర్థాన్ని చెప్పింది. శీల గుణం అంటే, చాలా గొప్పవాడు చాలా తక్కువ వానితో ఎటువంటి అరమరికలు లేకుండా మెలగడం. " మహతో మందైః స్సహ నీరంధ్రేణ సంశ్లేషః" అని శాస్త్రజ్ఞులు ఈ గుణాన్ని నిర్వచించారుకదా. దాని ఆధిక్యమే సౌశీల్యం. ఆ గుణాన్ని పరిపూర్ణంగా కలిగినవాడు– అని ప్రస్తుతంలో అర్థం. అంటే, లోకంలో శీలగుణాన్ని కలిగిన వారు ఉంటే ఉండవచ్చునేమో గాని, శ్రీరామునకు కల శీలగుణం అనితర సాధారణం, నిస్సమాభ్యధికం. దీనికి శ్రీరామాయణంలో ఎన్నో వృత్తాంతాలు ఉదాహరణలుగా వెలుగుతున్నాయి. కనుక, అది అతని పరత్వ సూచకం. ఈ విధంగా ఈ "గుణవాన్" అనే పదం భగవంతుని అసాధారణ లింగాలైన పరత్వసౌలభ్యాలను రెండిటిని సూచిస్తున్నదని చెప్పవచ్చు. కనుక, "గుణవాన్" అని ప్రశ్నించడం ద్వారా వాల్మీకి మహర్షి చేసిన ప్రశ్న సామాన్య మానవుని గూర్చి కాదని. సాక్షాత్తు సకల కల్యాణ గుణాకరుడైన, పరత్వసౌలభ్య గుణవిశిష్టుడైన భగవానుడు ఇప్పుడు ఏ రూపంలో భూమిలో అవతరించాడు ? అనే జిజ్ఞాసతోనే వాల్మీకి ప్రశ్నించాడని కూడా ఇక్కడ ఏర్పడుతున్నది.

"కః గుణవాన్?" అనే ఈ మొదటి ప్రశ్నలో వేరొక విశేషాన్ని కూడా వ్యాఖ్యాతలు వివరించారు. లోకంలో ఒక వస్తువు కానీ ఒక వ్యక్తి కానీ అతిశయాన్ని కలిగి ఉండడానికి కారణం ఆ వస్తువులో, లేక, ఆ వ్యక్తిలో ఉండే సద్గుణాలు. అయితే, ఈ క్రమం భగవద్విషయంలో విపరీతంగా ఉంటుంది.

ఎందుకంటే, గుణి అయిన భగవంతుని సంబంధం వల్ల భగవంతుని గుణాలకు అతిశయమే తప్ప, గుణాల వల్ల భగవంతునకు అంతకు ముందు లేని అతిశయం కలిగింది అని చెప్పడానికి వీలు లేదు కదా. అందువల్ల కూడా ఇక్కడ "గుణవాన్" అని గుణి శబ్దాన్ని ముందుగా ప్రస్తావించడం జరిగింది.

ఈ విధంగా మొదట సౌశీల్య గుణ ప్రస్తావన చేసిన తరువాత, "కః వీర్యవాన్ " వీర్య గుణాన్ని కలిగినవాడు ఎవరడు? అని వీర్యగుణ ప్రస్తావనను రెండవ ప్రశ్నతో చేయడం జరుగుతున్నది. వీర్య గుణం అంటే, వికారం కలిగే సందర్భంలో కూడా, వికారం కలిగే కారణాలు పరిపూర్ణంగా ఉన్నప్పటికీ కూడా, ఎటువంటి వికారాన్ని మనసులో కాని, శరీరంలో కానీ పొందకుండా ఉండడం వీర్యగుణం అనబడుతుంది. "వీర్యవాన్ "అనే నిర్దేశం" లోక విలక్షణమైన వీర్యగుణాన్ని కలిగినవాడు ఎవడు? " అనే ప్రశ్నను తెలుపుతుంది. దీనివల్ల, ఈ ప్రశ్న కూడా పరత్వాన్నే సూచిస్తుంది. ఎందుకంటే, భగవానుడు అచిత్తులు ఉండే స్వరూప వికారాన్ని కానీ, సచిద్వస్తువులలో ఏర్పడే స్వభావ వికారాన్ని కానీ, ఎంత మాత్రం కలిగినవాడు కాదు కదా. ఈ విషయం ఇక్కడ "వీర్యవాన్ " అనే పదం సూచిస్తున్నది కనుక, ఇది కూడా పరత్వసాధకమే.

అందువల్ల, వాల్మీకి చేసిన ప్రశ్నలోని క్రమాన్ని చూసినట్లయితే, మొదట భగవానుని లోక విసదృశమైన సౌశీల్య గుణం ప్రస్తావింపబడింది, – అని, దానికి తరువాత లోక విలక్షణమైన వీర్య గుణం ప్రస్తాపబడింది – అని ఏర్పడుతున్నది. ఇది ఒక అనుభవ క్రమం. బుద్ధిస్థ క్రమం.

ఇటువంటి క్రమంలోనే నమ్మాళ్వార్లు తమ తిరువాయ్ మొళి ప్రబంధంలో భగవంతుని అనుభవించారు. దానిని, వ్యాఖ్యాత నంబిళ్ళై ఈడు వ్యాఖ్యానంలో రమ్యంగా ఈ విధంగా నిరూపించారు.

ఈ పాశురం– ఈ ప్రబంధం లోని నాలుగవ శతకం–ఎనిమిదవ దశకంలో ఏఱాళుమ్" అనే మొదటి పాశురం. ఇందులో ఆళ్వార్లు నాయకీ

భావాన్ని పొంది పలుకుతున్నారు. భగవంతుని సేవకు, ఆనందానికి ఉపయోగపడని తమ ఆత్మ కానీ, ఆత్మీయాలు కానీ, తమకు వద్దని నిరసించే సందర్భం, ఇది. ముందుగా, ఈ పాశురాన్ని గమనిద్దాం.

**"ఏఱాళుమ్ ఇఱైయోనుమ్ తిశైముకనుమ్ తిరుమకళుమ్**
**కూఱాళుమ్ తనియుడంబన్ కులంకులమా వశురర్ కళై,**
**నీఱాకుమ్ పడియాక నిరుమిత్తు ప్పడై తొట్ట**
**మాఱాళన్ కవరాద మణిమామై కుఱైవిలమే"**

(వృషభ వాహనుడైన పరమశివుడు, చతుర్ముఖుడు, శ్రీ మహాలక్ష్మి – అనే వీరు తమకు తమకు తగిన విధంగా విభాగాలను పొంది, నివసించే విలక్షణ దివ్యదేహాన్ని కలిగివాడు, రాక్షసులను రూపులు గుంపులుగా భస్మం అయ్యేటట్లుగా సంకల్పించి, ఆయుధాన్ని గ్రహించి, ఆ కార్యాన్ని నిర్వహించినవాడు, ఆశ్రిత విరోధి నిరసన శీలుడైన భగవానుడు ఆశపడని నా లావణ్యంపై అపేక్ష లేదు) అని ఈ పాశురం ఉన్నది.

ఈ పాశురంలో, పరాంకుశ నాయకి భగవంతుని సౌశీల్య గుణా న్ని ముందుగా అనుభవించి, ఆ తరువాత వీర్య గుణాన్ని అనుభవిస్తున్నది – అని, ఈ క్రమం పైన ప్రస్తావించిన " కః శీలవాన్ ?కఃవీర్యవాన్ ?"అనే వాల్మీకి పల్కిన శ్రీరామాయణ సూక్తిని పోలి ఉన్నదని వ్యాఖ్యాత వివరించారు.

వేదాత్మకుడైన గరుడుని వాహనంగా కలిగిన భగవంతునకు తాను సాటి అని భావించి, ఒక వృషభాన్ని వాహనంగా గ్రహించి సంచరించే పరమశివుడు, సృష్టి కార్యానికి అనుగుణంగా ఎల్లప్పుడూ నాలుగు వేదాలను ఉచ్చరించడానికి తగినట్లుగా నాలుగు ముఖాలను కలిగినవాడై, " నేను జగత్తును సృష్టించేవాడను" అని అభిమానించే చతుర్ముఖుడు– అనే అహంకార మమకారాలను కలిగిన ఈ ఇద్దరికీ, " అనన్యా రాఘవేణాహమ్" (నేను శ్రీరాముని కంటే వేరు కాదు) అని చెప్పినట్లుగా " నేను భగవంతునకు

శేషభూతురాలను " అని ఎల్లప్పుడూ భావించే లక్ష్మీదేవికి, ఏ విధమైన తేడా లేకుండా పరమోదారుడై, తన శీల గుణాన్ని ప్రదర్శిస్తూ, వీరు ముగ్గురు తమ తమకు తగిన ప్రదేశాలలో భాగాలను పొంది, నివసించే విధంగా ఉండే అద్వితీయమైన దివ్యవంగళరూపాన్ని కలిగినవాడు, పరమాత్మ. "మేము అధికార పురుషులం!"అనే అహంకారాన్ని కలిగిన రుద్రునకు, బ్రహ్మకు – లక్ష్మీదేవికి అనుగ్రహించినట్లుగానే తన దివ్యమంగళ విగ్రహంలో స్థానాన్ని ప్రసాదించినవాడు, భగవంతుడు. భగవంతుని రూపం సర్వాపాశ్రయం కదా. అందువల్ల ఈ ప్రస్తావన భగవానుని అనన్య సామాన్యమైన శీల గుణాన్ని నిరూపిస్తున్నది. కనుక ఇది, " కః గుణవాన్?" అనే అర్థాన్ని పోలి ఉన్నది.

"కులమ్ కులమా వశురర్ కళై, నీఱాకుమ్ పడియాక నిరుమిత్తు ప్పడై తొట్ట " (గుంపులు గుంపులుగా ఉండే అసురులను భస్మం అయ్యేటట్టుగా సంకల్పించి, దానికి తగినట్లుగా ఆయుధాన్ని పరిగ్రహించినవాడు) అనే ఈ ప్రయోగం భగవంతుని వీర్య గుణాన్ని సూచిస్తున్నది. లంకలో ఉండే అసురులు అనేకులు కనుక, వారిని ఒక్కొక్కరిగా కాకుండా, గుంపులు గుంపులుగా శ్రీరాముడు వధించవలసి వచ్చింది. ఆ స్వామి అసురులను వధించిన ప్రకారాన్ని వాల్మీకి మహర్షి " ఛిన్నం భిన్నం శరైః దగ్ధమ్" అని అంటూ వర్ణించాడు. అంతేకాదు. శ్రీరాముడు వారిపై బాణాలు వేయాలని సంకల్పించినప్పుడే వారు నశించి పోయారు. భగవానుడు తాను తలచిన కార్యాన్ని నిర్వహించడానికి సంకల్పం మాత్రమే చాలు కదా సత్య సంకల్పుడు కదా, అతడు. కురుక్షేత్ర సంగ్రామంలో కూడా భగవానుడు ఈ విషయాన్ని "మయైవైతే దనిహతాః పూర్వమేవ" (అర్జునా! వీరంతా ఇంతకు ముందే నాచేత వధింపబడ్డారు. నేను "కురుక్షేత్ర సంగ్రామం జరగాలి" అని సంకల్పించిన ఆ క్షణమే వీరు నశించి పోయారు సుమా!) అన్నాడు కదా. అందువల్ల ఇక్కడ అసంఖ్యాకమైన అసుర సేనలో ప్రవేశించిన శ్రీరాములడు

ఎటువంటి వికారాన్ని మనస్సులో గానీ, శరీరంలో కాని పొందకుండా, వారిని అవలీలగా మట్టుపెట్టినందున, ఈ సందర్భం ఆ స్వామికి కల వీర్యగుణాన్ని సూచిస్తుంది. అందువల్ల ఇది, " కః వీర్యవాన్ ?" అనే సూక్తిలోని అర్థాన్ని పోలి ఉన్నది.

ఈ విధంగా ఈ నమ్మాళ్వారుల సూక్తిక్రమంలో " కః గుణవాన్? కః వీర్యవాన్?" అనే వాల్మీకి మహర్షి అడిగిన ప్రశ్నలోని క్రమం భాస్తున్నది – అని మన పూర్వాచార్యుల అభిప్రాయం.

ఇంకొక సమయంలో మరొక సూక్తి సామ్యాన్ని అనుభవిద్దాం.

★★★★★

# శ్రీరామాయణమ్ – తిరువాయ్ మొழி – 2



**ధర్మజ్ఞః సత్యసంధశ్చ ప్రజానాం చ హితే రతః |**

**యశస్వీ జ్ఞానసంపన్నః శుచి ర్వశ్యః సమాధిమాన్ ॥** (1-12)

శ్రీరాము శరణాగత రక్షణ రూపమైన ధర్మాన్ని తెలిసినవాడు, సత్యమైన ప్రతిజ్ఞను కలిగినవాడు, ప్రజల హితాన్ని చేయడంలో ఆసక్తిని కలిగినవాడు, ఆశ్రితులను రక్షిస్తాడు అనే కీర్తిని కలిగినవాడు, స్వరూపాన్ని బట్టి, స్వభావాన్నిబట్టి సమస్త విషయాలకు సంబంధించిన జ్ఞానాన్ని సహజంగా కలిగినవాడు, పరమపావనుడు, భక్తులకు వశమై ఉండేవాడు, ఎల్లప్పుడూ ఆశ్రితులను రక్షించడంలో ఆలోచనను కలిగి ఉండేవాడు.

వాల్మీకి అడిగిన ప్రశ్నకు సమాధానాన్ని చెప్పే నారదుడు, శ్రీరాముని గుణగణాలను కీర్తిస్తూ పలికే సందర్భంలో ఈ శ్లోకం ఉన్నది. ఈ శ్లోకాన్ని గోవిందరాజులవారు శ్రీరామచంద్రునకు కల, ఆశ్రిత రక్షణకు ఉపయోగపడే గుణాలను తెలియజేస్తున్నదనే దృష్టితో వ్యాఖ్యానించారు. ష దానికి అనుగుణంగానే ఈ శ్లోకంలో ఉండే విశేషణాలను అన్నిటిని వ్యాఖ్యానించారు. వారి వ్యాఖ్యాన క్రమం ఈ విధంగా ఉన్నది.

(ధర్మజ్ఞః) ధర్మం– శరణాగత రక్షణ రూపం ధర్మం, జానాతీతి ధర్మజ్ఞః. వక్ష్యతి, "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్"ఇతి – ధర్మం, అంటే, శరణాగత రక్షణ రూపమైన ధర్మం, దానిని చక్కగా తెలిసినవాడు కనుక శ్రీరాముడు ధర్మజ్ఞుడు. ఈ విషయం "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్" – మిత్రభావంతో నా దరికి చేరినవానిని నేను ఏ విధంగానూ విడచిపెట్టను. అతనిలో దోషం

ఉండవలసిందే. ఆ విధంగా దోషం ఉండడం మంచివారికి గర్హించదగినది కాదు– అని శ్రీరాముడు యుద్ధకాండలో ప్రారంభంలో, విభీషణ శరణాగతి సందర్భంగా పలుకబోయే సూక్తి ద్వారా నిరూపితమైనది.

(సత్యసంధశ్చ) "సత్యా, సంధా – ప్రతిజ్ఞా యస్య స సత్యసంధః." అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"– సత్యమైన సంధను, అంటే, ప్రతిజ్ఞను కలిగినవాడు కనుక, శ్రీరాముడు సత్యసంధుడు. "అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"– సీతాదేవీ! నా జీవితాన్ని అయినా వదిలిపెడతాను. లక్ష్మణునితో పాటు నిన్ను కూడా విడచి పెడతాను. అంతే తప్ప, ప్రతిజ్ఞ చేసి, దానిని మాత్రం విడిచిపెట్టను. అందులోను, బ్రాహ్మణులకు ఇచ్చిన మాటను నేను విశేషించి విడిచిపెట్టను– అని అన్నాడు, అరణ్యకాండలో, శ్రీరాముడు.

(ప్రజానాం చ హితే రతః) ప్రజానామ్ – ప్రాణినాం, హితే – హితకరణే, రతః – తత్పరః – శ్రీరాముడు ప్రజలకు మంచిని కలుగజేయడంలో ఎల్లప్పుడూ ఆసక్తిని కలిగి ఉండేవాడు.

(యశస్వీ) ఆశ్రిత రక్షణైనకకీర్తిః, తస్య నామ మహద్యశః– ఇతి శ్రుతేః– శ్రీరాముడు తనను ఆశ్రయించినవారిని రక్షించడంలో సాటి లేని కీర్తిని కలిగినవాడు. . వేదంలో కూడా "అతని పేరు గొప్ప కీర్తిని కలిగినది" అని చెప్పబడింది.

(జ్ఞానసంపన్నః) "యః సర్వజ్ఞః సర్వవిత్– ఇత్యుక్త రీత్యా స్వరూపతః స్వభావతశ్చ సర్వవిషయ జ్ఞానశీలః" – "శ్రీరాముడు అన్నిటిని అన్ని విధాలుగాను తెలిసినవాడు" అని వేదం చెప్పిన రీతిలో, అన్ని విషయాల స్వరూపానికి, స్వభావానికి సంబంధించిన జ్ఞానాన్ని సహజంగా కలిగినవాడు. (ఇక్కడ, ఈ వివరణంలో, "జ్ఞాన సంపన్నః" అనే పదానికి, సహజంగా

జ్ఞానాన్ని కలిగినవాడు, అందువల్లనే, దానిని పరిపూర్ణంగా, అన్ని విధాలుగాను ఎల్లప్పుడూ, అంతటా, ప్రత్యక్షంగా కలవాడు – అనే అర్థం గ్రహింపబడింది)

(శుచిః) పావనః, పరిశుద్ధో వా, ఋజురితి యావత్. – శ్రీరాముడు పావనుడు, లేక, పరిశుద్ధుడు, అంటే, ఋజువైన స్వభావాన్ని కలిగినవాడు.

(వశ్యః) వశంగతః, ఆశ్రిత పరతంత్ర ఇత్యర్థః. – వశంగతుడు, తనను ఆశ్రయించినవారికి వశమై ఉండేవాడు – అని అర్థం.

(సమాధిమాన్) సమాధి రాశ్రిత రక్షణచింతా, తద్వాన్. – సమాధి అంటే, శ్రీరాముడు ఆశ్రితులను రక్షించాలనే ఆలోచన. దానిని కలిగినవాడు – అని అర్థం.

ఈ విధంగా, ఈ శ్లోకానికి గోవిందరాజీయ వ్యాఖ్యానం, ఈ శ్లోకంలోని విశేషణాలు అన్ని శ్రీరాముని ఆశ్రిత రక్షణ స్వభావాన్ని తెలియజేస్తున్నాయి – అని వివరించింది.

ప్రస్తుతంలో "జ్ఞాన సంపన్నః" అనేది ఆవశ్యకమైన విశేషణం. దీనికి "జ్ఞానేన సంపన్నః" అనే విగ్రహ వాక్యాన్ని చెప్పినప్పుడు, "ధాన్యేన ధనవాన్" – ధాన్యంచేత ధనవంతుడు – అనే రీతిలో " జ్ఞానం చేత సంపన్నుడు, అంటే, జ్ఞానం అనే పరిపూర్ణమైన సంపదను కలవాడు– అనే సామాన్యమైన అర్థం స్ఫురిస్తుంది. అయితే, ఇక్కడ, "జ్ఞానేన సంపన్నః" అనే విగ్రహవాక్యానికి "జ్ఞానం చేత చక్కగా పొందబడినవాడు, అంటే, జ్ఞానమే స్వయంగా కోరి కోరి భగవానుని ఆశ్రయించింది" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. అంటే, లోకంలో ఉండేవారి జ్ఞానం వారి వారి ప్రయత్నసాధ్యం. అందువల్ల అది, వారి ప్రయత్నానికి అనుగుణంగా ఉండే పరిమితిలో ఉంటుంది. కానీ భగవంతుని జ్ఞానం అటువంటిది కాదు, సహజమైనది. అంతే కాదు. లోకంలో గుణాల వల్ల ఆ గుణాలను కలిగిన వ్యక్తికి అంతకు ముందు లేని అతిశయం కలుగుతుంది. కాని, భగవంతుని గుణాల వల్ల ఆ స్వామికి అంతకు ముందు లేని ఉత్కర్ష ఏదీ

కలుగదు. ఆ గుణాలకే సార్థక్యం అతిశయం ఏర్పడుతుంది. ఈ విషయాన్ని శ్రీవిష్ణు పురాణం "సమస్త కళ్యాణ గుణాత్మకః" అని తెలిపింది. కూరేశులుకూడా స్వయంగా వరదరాజస్తవంలో–

**"గుణాయత్తం లోకే గుణిషు మతం మంగళపదం,**
**విపర్యస్తం లోకే హస్తిక్షితిధరపతే! తత్త్వయి పునః,**
**గుణాః సత్యజ్ఞానప్రభృతయ ఉత త్వద్గతతయా**
**శుభీభూయం యాతా ఇతి హి నిరణైష్మ శ్రుతివశాత్"** (11)

(ఓ వరదరాజస్వామీ! లోకంలో, ఒక వ్యక్తిలో ఉండే పవిత్రత అనేది ఆ వ్యక్తిలో ఉండే గుణాలపై ఆధారపడి ఉంటుంది. కానీ, ఆ క్రమం నీలో అయితే తారుమారుగా కనిపిస్తున్నది. ఎందుకంటే, సత్యం, జ్ఞానం మొదలైన గుణాలు నిన్ను పొందినందు వల్లనే అవి పవిత్రతను పొందాయి– అనే విషయాన్ని వేదాన్ని ఆధారంగా చేసుకుని నిర్ణయించుకున్నాము కదా) అనే సూక్తిలో తెలియజేశారు.

ఇందువల్ల, భగవానుని జ్ఞానం సహజ సిద్ధమైనది కనుక, అది ఏ లోటు లేనిదిగా, సంపూర్ణమైనదిగా ఉంటుంది. ఇందువల్ల, "జ్ఞాన సంపన్నః" అనే ఈ విశేషణం భగవంతుడు అన్ని విధాల సమగ్రమైన జ్ఞానాన్ని కలిగి ఉండడాన్ని తెలుపుతుంది.

ద్వయ మంత్రం పూర్వ వాక్యంలో ఉండే నారాయణ శబ్దంలో వ్యక్తం అవుతున్న చేతనుడు ఆశ్రయించటానికి ఆవశ్యకమైన భగవద్గుణాలను వివరించే సందర్భంలో పిళ్ళై లోకాచార్య స్వామివారు ముముక్షుప్పడి గ్రంథంలో వివరిస్తూ" లక్ష్మీదేవి చేసిన పురుషకార బలం వల్ల భగవంతునిలో ఉండే స్వాతంత్రం అనే గుణం తలవంచినప్పుడు తల ఎత్తే గుణాలను చెబుతున్నది. ఆ గుణాలు ఏవి అంటే, స్వామిత్వం, వాత్సల్యం, సౌశీల్యం, సౌలభ్యం, జ్ఞానం, శక్తి అనే ఆరు గుణాలు" అని తెలియజేసి, ఆ తరువాత ఈ

గుణాలు ఉపకరించే ప్రకారాన్ని తెలియజేస్తూ, తనను ఆశ్రయించే చేతనుదిలో ఉండే విరోధిని పోగొట్టి తనను అనుగ్రహించడానికి భగవానునకు జ్ఞానం, శక్తి అనే గుణాలు ఉపయోగపడతాయి – అని అన్నారు.

శ్రీవరవరమునులు ఈ సూక్తిని వ్యాఖ్యానిస్తూ" జ్ఞానం అనే గుణం ఈ చేతనునకు తొలగించవలసిన అనిష్టాలను, అనుగ్రహించవలసిన ఇష్టాలను స్పష్టంగా తెలుసుకోవడానికి తగినట్లుగా, తనకంటే వేరైన సమస్త పదార్థాలను సాక్షాత్తుగా ఒక్కసారిగా ప్రత్యక్షీకరించుకోగలిగిన జ్ఞానం" అని వివరించారు.

ఇందువల్ల ఇక్కడ, ఇటువంటి జ్ఞానం అనే గుణాన్ని పరిపూర్ణంగా కలిగినవాడు, శ్రీరాముడు – అని "జ్ఞాన సంపన్నః "అనే విశేషణంలోని తాత్పర్యం.

నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி ప్రబంధంలోని సూక్తులను వ్యాఖ్యానించేటప్పుడు, మన పూర్వాచార్యులు పలు సందర్భాలలో శ్రీరామాయణంలోని సూక్తులను ప్రమాణంగా ఉదాహరించి, ఆళ్వారుల సూక్తులతో అవి అర్థసంవాదాన్ని కలిగినవిగా నిరూపించారు. ప్రస్తుత శ్లోకంలోని "జ్ఞానసంపన్నః" అనే విశేషణాన్ని నంబిళ్ళై అనే మహనీయులు, పెరియ వాచ్చాన్ పిళ్ళై అనే మహనీయులు తిరువాయ్ మొழி ప్రబంధంలోని (6–1) దశకానికి అవతారికను అనుగ్రహిస్తూ ఉట్టంకించి, ఈ పదం ద్వారా ధ్వనించే అర్థవిశేషాన్ని రమణీయంగా ఆ సందర్భానికి అనుగుణంగా అన్వయిస్తూ వివరించారు. ఆ విషయాన్ని కొంచెం గమనిద్దాం.

ఈ దశకంలో శఠకోపసూరి, పరాంకుశ నాయకీభావంతో పాశురాలను పలుకుతున్నారు. ఇందులో పరాంకుశ నాయకి " తిరువణ్ వండూర్ "అనే దివ్యదేశంలో ఉండే స్వామి దగ్గరకు పక్షులను దూతగా పంపుతున్నది. ఈ విధంగా భగవంతుని దగ్గరకు పక్షులను దూతలుగా పంపడం అంటే సదచార్యుల ద్వారా భగవంతుని ఆశ్రయించడమే. పక్షులు

సదాచార్యులకు ప్రతీకలుగా మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః, , తథైవ జ్ఞానకర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః" (పక్షులు ఏ విధంగా అయితే రెండు రెక్కల సహాయంతో ఆకాశంలో ఎగుర గలుగుతున్నాయో, ఆ విధంగానే జ్ఞానులు జ్ఞానం ఆచారం అనే రెండు రెక్కల సహాయంతో పరమాత్మను పొందగలుగుతున్నారు) అనే సూక్తి పక్షులకు సదాచార్యులకు మధ్య ఉండే సామ్యాన్ని తెలుపుతున్నది కదా.

ఆ విధంగా భగవంతుని దగ్గరకు సందేశాన్ని పంపేటప్పుడు, "స్వామి ఆశ్రితులను రక్షించే స్వభావాన్ని కలిగినవాడు – అనే విషయాన్ని నిరూపించే గుణాలను కలిగినవాడు" అనే నమ్మకం కలిగినప్పుడు కదా, నాయకి సందేశాన్ని పంపించే అవకాశం ఉంటుంది, నాయకి కూడా సందేశాన్ని పంపించాలని ప్రయత్నిస్తుంది. మరి, స్వామిలో అటువంటి గుణాలు ఉన్నాయి – అని నాయకి నిశ్చయించుకున్నది అని భావించడానికి తగిన ప్రమాణాలు ఏమి ఉన్నాయి? అనే సందేహం ఇక్కడ కలుగుతుంది కనుక, ఆ సందేహాన్ని నివృత్తి చేయడం కోసం వ్యాఖ్యాతలైన పూర్వాచార్యులు "భగవంతునిలో శరణాగత రక్షణకు ఆవశ్యకమైన గుణాలు అన్నీ ఉన్నాయి" అని నిరూపించటానికి ప్రమాణంగా శ్రీరామాయణంలోని ప్రయోగాన్ని ఉదాహరించదలచి, పై శ్లోకంలోని "జ్ఞానసంపన్న ః"అనే ప్రయోగాన్ని ప్రమాణంగా ఉదాహరించారు. ఈ సూక్తిని ప్రమాణంగా ఉదాహరించడంలో వ్యాఖ్యాతల ఉద్దేశ్యం ఏమంటే,

శరణాగత రక్షణకు ముఖ్యంగా ఆవశ్యకమైన గుణాలు మూడు. అవి, జ్ఞానం, కరుణ, శక్తి అనేవి. శరణాగతుని రక్షణను ఏ విధంగా చేయాలో తెలియాలంటే, జ్ఞానం కలిగి ఉండాలి. ఆ జ్ఞానం పరిపూర్ణంగా ఉండాలి. అప్పుడే శరణాగత రక్షణను ఏవిధంగా చేయాలో, దానికి తగిన ఉపాయం ఏదో, శరణ్యుడు తెలుసుకునే అవకాశం ఉంటుంది. ఉపాయాన్ని

తెలుసుకుంటే చాలదు, దానిని నిర్వహించి పూర్తి చేయగలిగిన శక్తిని అతడు కలిగి ఉండాలి. ఆ శక్తి కూడా పరిపూర్ణంగా ఉండాలి. ఈ విధంగా జ్ఞానం, శక్తి అనే రెండూ ఉన్నా చాలదు. శరణాగతుని దీనదశను చూసి, అయ్యో! అని జాలిపడే కరుణను, అతనిలో ఉండే దోషాన్ని గుణంగా గ్రహించే స్వభావం అయిన వాత్సల్యాన్ని కూడా అతడు కలిగి ఉండాలి. కూరేశులు అతిమానుషస్తవం చివరిలో " తత్ జ్ఞాన శక్తి కరుణాసు సతీషు నేహ పాపం పరాక్రమితు మర్హతి మామకీనమ్" (స్వామీ! నీకు జ్ఞానం, శక్తి, కరుణ అనే గుణాలు ఉండగా, నా పాపం పరాక్రమించడం అనేది ఎంత మాత్రం నీకు తగినది కాదు సుమా!) అనే సూక్తిలో ఈ విషయాన్ని అనుగ్రహించారు.

అందువల్ల, ఈ మూడు భగవానులలో పరిపూర్ణంగా ఉన్నాయి – అని తెలిసినప్పుడు, నాయకి భగవానుని దగ్గరకు పక్షులను దూతగా పంపించే అవకాశం ఉన్నది. ఈ మూడు గుణాలు భగవానునిలో ఉన్నాయి– అని నిరూపించడానికి తగిన, శ్రీరామాయణంలో వేరు వేరు సందర్భాలలో గోచరించే మూడు ప్రమాణాలను ఈ సందర్భంలో వ్యాఖ్యాతలు ఉదాహరించారు. "జ్ఞానసంపన్నః " అనే ప్రస్తుత ప్రమాణం, భగవత్స్వరూపుడైన శ్రీరామచంద్రుని సార్వపథీనమైన జ్ఞానాన్ని తెలియజేస్తున్నది – అని వ్యాఖ్యాతల అభిప్రాయం.

ఇపుడు, ఈడు వ్యాఖ్యానంలో నంబిళ్ళై ఈ ప్రమాణాన్ని ఉదాహరిస్తూ పలికిన సూక్తిని గమనిద్దాం.

"తూదుళ విడువార్ నాయకన్ పక్కలిలే శిల గుణంగళ్ కండిటే విడువదు. అవై యావన– ఇత్తలైయిల్ ఆర్తి అఱియుందనై యఱివైయు ముడైయనాయ్, అరిందాల్ వరుకైక్కీడాన నీర్మైయు ముడైయనాయ్, వరుకైక్కీడాన శక్తియుముడైయనా యిరుక్కైయిఱే. అవై ఎల్లామ్ ఈవళ్ తూదు విడుకిఱ విషయత్తిల్ కుఱై యిల్లై. అఱివిల్ వందాల్, "జ్ఞానసంపన్నః"

ఎన్గిఱపడియే, అటివు కొడుత్త వశిష్టాదిగళుక్కుమ్ ఉపకరిక్క వల్లనాప్పడి ఇరుప్పానొరువన్" (లోకంలో నాయకుని దగ్గరకు సందేశాన్ని పంపించే నాయకి, ఆ నాయకునిలో కొన్ని గుణాలను చూచికదా, పంపిస్తుంది. ఆ గుణాలు ఏవి? అంటే, నాయకుడు తనను ఆశ్రయించే ఆశ్రితునిలో ఉండే ఆర్తిని తెలుసుకోగలిగిన పరిధిలోని జ్ఞానాన్ని కలిగినవాడై, దానిని తెలుసుకున్న తరువాత, తానుశఆశ్రితుని దగ్గరకు రావడానికి ఆవశ్యకమైన, పరిపూర్ణమైన జాలిని కలిగినవాడై, అంతవరకు రావడానికి కావలసిన శక్తిని పరిపూర్ణంగా కలిగినవాడై ఉండడమే కదా, ఇది. అవి అన్నీ, ఈ పరాంకుశ నాయకి సందేశాన్ని పంపించే భగవానుడనే విషయంలో ఏ కొరత లేకుండా ఉన్నాయి కదా.

జ్ఞానం విషయానికి వస్తే, " జ్ఞానసంపన్నః" అనే విధంగా, తనకు జ్ఞానాన్ని ప్రసాదించి వశిష్టునకు కూడా ఉపదేశించగలిగిన రీతిలో ఉండే జ్ఞానాన్ని కలిగిన అద్వితీయుడు, అతడు). ఇది పై వ్యాఖ్యాన సూక్తిలోని భావం వశిష్టునకు శ్రీరాముడు జ్ఞానాన్ని ఉపదేశించిన సందర్భం ఎప్పుడు సంభవించింది? అంటే, శ్రీరాముని దగ్గరకు భరతుడు వచ్చి, అయోధ్యకు తిరిగి వచ్చి, రాజ్యపాదనను చేయవలసినదిగా ప్రార్థించినప్పుడు, శ్రీరాముడు అతని ప్రార్థనను తిరస్కరించాడు. అప్పుడు వశిష్టుడు శ్రీరామునితో కొన్ని సామాన్యధర్మాలను పలికి, అతడు అయోధ్యకు తిరిగి వచ్చి, రాజ్యపాలనను సాగించమని నచ్చజెప్పడానికి ప్రయత్నం చేశాడు. అప్పుడు, శ్రీరాముడు వశిష్టుని ఆ వాదాలను తిరస్కరిస్తూ, వాస్తవమైన ధర్మం ఏదో నిరూపిస్తూ, వశిష్ఠునకు తగిన విధంగా సమాధానాన్ని పలికాడు. ఈ సందర్భాన్ని దృష్టిలో పెట్టుకొని, నంబిళ్ళై ఈ విధంగా పలికారు.

ఇక్కడ, నంబిళ్ళై తమ వ్యాఖ్యానసూక్తిలో– "జ్ఞానసంపన్నః" అనే శ్రీరామాయణ ప్రయోగంలో ద్యోతకమవుతున్నదని అనుగ్రహించిన అర్థవిశేషం గమనించదగినది.

“జ్ఞానసంపన్నః” జ్ఞానం అనే సంపదను సమృద్ధిగా, పరిపూర్ణంగా, అన్ని వేళలా అంతటా, అన్ని విధాలుగా కలిగినవాడు– అని అర్థం. శ్రీరాముని జ్ఞానం ఎంత పరిపూర్ణమైనది, సమగ్రమైనది అంటే, తనకు విద్యను నేర్పించిన వశిష్టునకు సైతం ఉపదేశించగలిగిన అవధిలోని సమగ్రతను కలిగినది. . ఈ అర్థం, ఇక్కడ, “సంపన్నః” అనే పదం ద్వారా స్ఫురిస్తున్నది. ఇంతటి గొప్ప జ్ఞానాన్ని కలిగినవాడు కనుకనే, ఆశ్రితుల ఆర్తిని అన్ని విధాలుగాను తెలుసుకోగలిగినవాడు, శ్రీరాముడు – అనేది స్ఫురిస్తున్నది– అనేది వ్యాఖ్యాతల అభిప్రాయం. ఈ ప్రమాణాన్ని శ్రీకృష్ణ సూరి కూడా తమ వ్యాఖ్యానంలో ఈ సందర్భంలోనే ఉదాహరించారు.

ఈ విధంగా వ్యాఖ్యాతలు, ఈ విశేషణం భగవానుని పరిపూర్ణమైన జ్ఞానవైభవాన్ని తెలియజేస్తున్నది, కనుక, ప్రస్తుతంలో పరాంకుశ నాయకి, ఆ స్వామి దగ్గరకు సందేశాన్ని పంపించడానికి ఆవశ్యకమైన జ్ఞాన సంపదను కలిగినవాడు– అనే విషయానికి ప్రమాణం అనే దృష్టిలో ఉదాహరించారు.



# తిరువాయ్ మొழி – శ్రీరామాయణమ్ – 3

★★★★★

## 6. విష్ణునా సదృశో వీర్యే సోమవత్ ప్రియదర్శనః |
## కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః ॥

(బాలకాండ –1 – 18)

శ్రీరాముడు వీర్యగుణంలో విష్ణువుతో సమానుడు, చంద్రుని వలె అందమైన రూపాన్ని కలిగినవాడు, క్రోధం వస్తే కాలాగ్నితో సమానుడు, క్షమాగుణం చేత భూమితో సమానుడు. .

శ్రీరాముని కళ్యాణ గుణాలను వర్ణిస్తూ నారదుడు పలికే సందర్భంలో ఈ శ్లోకం ఉన్నది. దీనిని గోవిందరాజులు ఈ క్రింది విధంగా వ్యాఖ్యానించారు.

(విష్ణునా సదృశో వీర్యే) వీర్యగుణవిషయంలో విష్ణువుతో శ్రీరాముడు సమానుడు. ఎందుకంటే, అతడు "విష్ణోరర్ధం మహాభాగమ్" అని చెప్పినట్లు విష్ణువు యొక్క అంశలో, సగం అంశతో అవతరించినవాడు కనుక. దశరథుడు ప్రజాపత్య పురుషుడు ఇచ్చిన పాయసాన్ని విభాగం చేసి తన పత్నులకు ఇచ్చినప్పుడు, ఆ పాయసంలో సగభాగాన్ని కౌసల్యకు ఇచ్చాడు. ఇందుచేత శ్రీరామనకు విష్ణువుతో సాదృశ్యం సులభంగా చెప్పవచ్చు. అంతేకాకుండా, " స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" (ఆ భగవానుడు ఈ లోకంలో అవతరించినవాడు అయినప్పుడే శ్రేయస్సును పొందినవాడు అవుతున్నాడు) అని వేదంలో చెప్పినందువల్ల, విష్ణువు అంశతో అవతరించిన శ్రీరామునకు ఆ విష్ణువుతో సాదృశ్యం చెప్పడం యుక్తమే.

(సోమవత్ ప్రియదర్శనః) శోకాన్ని పోగొట్టడంతో పాటు ఆహ్లాదాన్ని కూడా కలిగించేవాడు – అని అర్థం.

(కాలాగ్నిసదృశః క్రోధే) కాలాగ్నితో సమానమైన క్రోధాన్ని కలవాడు – అని అర్థం. శ్రీరాముడు తన విషయంలో చేసిన అపరాధాన్ని స్వయంగా

సహిస్తాడు కానీ, తనను ఆశ్రయించిన వారి విషయంలో అపరాధం చేస్తే, అప్పుడు జ్వలించే అగ్ని వలె అవుతాడు. సహజంగా చాలా చల్లనిది అయిన తన హృదయంలో కోపాన్ని ఆరోపించుకుంటాడు – అని అర్థం. నీటిలో కూడా బడబాగ్ని అనే పేరుతో భయంకరమైన అగ్ని మండుతూ ఉంటుంది కదా.

ఈ విషయాన్ని శ్రీరామాయణం యుద్ధకాండలోని ఒక సందర్భంలో గమనించవచ్చు. "రావణేన కృతవ్రణం, దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశమేయివాన్"– (రావణుడు తనపై ఎన్నో బాణాలను ప్రయోగించి గాయపరచినప్పటికీ అతనిపై ఏమాత్రం కోపించని శ్రీరాముడు, తన భక్తుడైన హనుమంతుని రావణుడు గాయపరచడాన్ని చూడగానే సహించలేక, కోపానికి వశుడయ్యాడు) అనే శ్రీరామాయణ సూక్తి దీనిని తెలుపుతున్నది.

(క్షమయా పృథివీసమః) క్షమారూపమైన సదృశ ధర్మం కలిగినవాడు కనుక, ఆ గుణాన్ని కలిగిన భూమితో సమానుడు.

ఈ శ్లోకంలో నారదుడు, శ్రీరాముడు, ఒక్కొక్క గుణంతో ఒక్కరితో సామ్యాన్ని కలిగి ఉన్నాడు –అని అన్నాడు. ఒకే వ్యక్తికి పలువురితో, పలు వస్తువులతో గుణాన్ని బట్టి గాని, రూపాన్ని బట్టి కానీ, క్రియను బట్టి కానీ పోలిక ఉండవచ్చు కదా. ఈ అంశాలను పురస్కరించుకొని ఒకే వ్యక్తిని పలువురు పలు రకాలుగా ఉల్లేఖించడం ఆ విధంగానే ఒకే వ్యక్తిని ఒకరే వివిధ అంశాలను పురస్కరించుకొని వివిధంగా ఉల్లేఖించడం అనేది అలంకార శాస్త్రంలో ఉలేఖాలంకారం అనబడుతుంది. ఇటువంటి ఉల్లేఖాలంకార ప్రక్రియలో ప్రస్తుత నారదుని సూక్తి ఉన్నది. ఇక్కడ వక్త నారదుడు ఒక్కడే, వర్ణింపబడే వస్తువు శ్రీరాముడు ఒక్కడే, కానీ, ఆ శ్రీరామునిలో ఉండే అనేక విధాలైన కళ్యాణ గుణాలను పురస్కరించుకొని నారదుడు ఆ శ్రీరాముని అనేక విధాలుగా ఉల్లేఖిస్తున్నాడు. ఒకే వ్యక్తిలో వివిధ ధర్మాలు ఉండడంలో,

ఉన్నట్లు భావించడంలో అడ్డు లేదు కదా. అయితే, ఆ ధర్మాలు పరస్పరం విరుద్ధాలు కాకుండా ఉండాలి, , అంతే. ఇక్కడ నారదుని వచనం ద్వారా వ్యక్తం అవుతున్న శ్రీరాముని గుణాలు పరస్పర విరుద్ధాలు కావు, కనుక, శ్రీరాముని అనేక విధాలుగా ఉల్లేఖించడంలో ఏ విధమైన విప్రతిపత్తి లేదు. అంతే కాదు, ఆ విధంగా చెప్పడం వల్ల ఒక అతిశయం కలుగుతున్నది కూడా.

దివ్యసూరుల దివ్య ప్రబంధ సూక్తులలో కూడా ఈ ఉల్లేఖాలంకారం పలుచోట్ల బాసిస్తున్నది. నమ్మాళ్వారులు అనుగ్రహించిన తిరువాయ్ మొழி దివ్యప్రబంధంలో ఒకచోట, "ఆడియాడి", (2–4) అనే దశకంలోని "ఇరక్కమ్" అని ఆరంభం అవుతున్న ఐదవ పాశురంలో, ఈ ఉల్లేఖాలంకార ప్రక్రియలో ఒక సూక్తి క్రమం ఉన్నది. అయితే, ఇది భగవద్విషయంలో కాకుండా, భగవద్భక్తులైన ఆళ్వారుల విషయంలో, అందులోనూ, వారు నాయికాభావాన్ని పొందినపుడు, ఆమె ఆర్తిని గూర్చి ఆమె తల్లి భగవంతునకు నివేదిస్తూ పలికిన సందర్భంలో గోచరిస్తున్నది. ఆ సూక్తిని వ్యాఖ్యానిస్తూ నంబిళ్ళైఅనే ఆచార్యులు పైన ప్రస్తావించిన శ్రీరామాయణ సూక్తిని ప్రమాణంగా ఉదాహరించారు.

పరాంకుకుశ నాయకి తల్లి, తన కుమార్తె పరాంకుశ నాయకికి కలిగిన భగవదభినివేశ ప్రయుక్తమైన ఆర్త్యతిశయ దశను గూర్చి తెలియజేస్తూ, ఆమె దశకు రెండు నిదర్శనాలను " ఇరక్క మనత్తోడు ఎరియిళై, అరక్కు మెழுకు మొక్కుమివళ్" (అభినివేశాతిశయంతో కూడిన మనసుతో ఈమె అగ్నిసకాశంలో ఉండే లక్కతో, మైనంతో పోలి ఉన్నది) అని అంటున్నది.

ఇక్కడ, వక్త పరాంకుశ నాయకి తల్లి ఒక్కతే. ఆమె ప్రస్తావించి పలికే వ్యక్తి కూడా ఒక్కరే, అది పరాంకుశ నాయకి. అయితే, తల్లి తన కుమార్తెలో ఉండే ఆర్తి విశేషాన్ని తెలుపడం కోసం ఆమెకు రెండు నిదర్శనాలను తెలుపగోరి, ఉల్లేఖాలంకార ప్రక్రియలో భగవంతునితో పలుకుతున్నది.

స్వామీ! నీ విషయంలో ఉండే అత్యంతాభినివేశం కారణంగా నా కుమార్తె దశ ఏ విధంగా ఉన్నదంటే, అగ్ని సన్నిధిలో కరిగిపోయే లక్క వలె, మైనం వలె ఉన్నదిసుమ –అని అంటున్నది. ఇందువల్ల ఇక్కడ పరాంకుశ నాయకిని అగ్నిసకాశంలో కరిగిపోయే లక్కతో, మైనంతో పోలుస్తూ చెప్పినందువల్ల, ఈ సూక్తి, పైన ప్రస్తావించిన శ్రీరామాయణ సూక్తి వలె, ఉల్లేఖాలంకార క్రమంలో ఉన్నది. అయితే, తేడా ఏమి? అంటే, నారద మహర్షి సూక్తి భగవద్విషయకమైనది కాగా, ఆళ్వారుల సూక్తి భాగవత విషయకమైనది. అంతేకాదు, నారదుని సూక్తి, శ్రరామునిలో ఉండే వేరు వేరు కళ్యాణ గుణాలను తెలుపడం కోసం వేరు వేరు ఉపమానాలను తెలుపుతున్నది. కానీ, ఆళ్వారుల సూక్తిలో విశేషం ఏమంటే, భగవానుని విషయంలో ఉండే అభినివేశం వల్ల ద్రవించడం అనే అళ్వార్ నాయకికి కల ఒకే గుణాన్ని వర్ణించడం కోసం, రెండు వేరు వేరు ఉపమానాలు చెప్పబడడం.

పైన ఉదాహరించిన నమ్మాళ్వార్ల శ్రీ సూక్తిని భట్టర్, తిరునఱైయూర్ అరైయర్ అనే ఇద్దరు ఆచార్యులు వేరు వేరు విధంగా వివరించారు. అరైయర్ అనే ఆచార్యులు పైన ఆళ్వారుల సూక్తిలోని రెండు ఉపమానాలలో, లక్కను నాయకి మనస్సునకు, మైనాన్ని నాయకి అన్వయించి అర్థం చెప్పారు. కానీ, భట్టర్ మాత్రం, నాయకి మనస్సు నాయకి విధేయంగా ఉన్నందువల్ల, పైన ప్రస్తావించిన సూక్తిలో ఉపమానంగా చెప్పబడిన లక్క, మైనం – అనే రెండు వస్తువులను నాయకికే అన్వయిస్తూ వివరించారు. ఇందువల్ల, ఉల్లేఖాలంకారసమన్వయం భట్టర్ చెప్పిన అర్థనిర్వాహంలోనే కుదురుతుంది. అంతేకాక, ఈ విధమైన సమన్వయం వల్ల ఒక విశిష్టమైన అర్థం కూడా గోచరిస్తుంది.

ఈ సందర్భంగా ఒక విషయం ఇక్కడ గమనించవలసి ఉన్నది. ఓకే గుణాన్ని చెప్పడం కోసం ఇక్కడ ఆళ్వార్లు రెండు వేరు వేరు ఉపమానాలను

ప్రయోగించారు కదా. దీనివల్ల వారు ఏ ప్రయోజనం సాధించినట్లు? ఎందుకంటే, ఇక్కడ ఉపమానాలుగా చెప్పబడిన లక్క, మైనం – అనే రెండు వస్తువులు అగ్నిసాన్నిధ్యంలో కరిగిపోయేవే కదా. ఒకే గుణాన్ని కలిగిన రెండు వస్తువులను ఇక్కడ ప్రస్తావించడం ద్వారా ఆళ్వారులు ఏ అధికమైన విశేషాన్ని వ్యక్తం చేశారు? ఒకే అర్థం చెప్పబడితే, చెప్పిన విషయాన్ని చెప్పడం అనే పునరుక్తి దోషం ప్రసంగిస్తుంది కదా। అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు.

అయితే, ఈ విధంగా వేరు వేరు ఉపమానాలను ఆళ్వార్ నాయకికి గల, "భగవదభినివేశాతిశయానికి కరగడం"– అనే ఒకే గుణాన్ని చెప్పడం కోసం ప్రయోగించినా, ఈ రెండిటిలో కొంచెం వైవిధ్యం ఉన్నది. ఈ రెండు నాయకి కి ఏర్పడే రెండు దశావిశేషాలను తెలుపుతున్నవి. ఒక సమయంలో ఆమె దశ లక్క వలె, మరొక సమయంలో ఆమె దశ మైనం వలె ఉన్నది. ఈ రెండు దశలు నాయకికి మారి మారి ఏర్పడుతూ ఉంటాయి. అందువల్ల ఈ రెండు ఉపమానాలను ఇక్కడ ప్రస్తావించడం జరిగింది.

అయితే, ఏ దశలో ఆమె లక్క వలె ఉన్నది? ఏ దశలో ఆమె మైనం వలె ఉన్నది ? అనే సందేహం ఇక్కడ కలుగవచ్చు. భగవంతుని విశ్లేషం వల్ల కలిగిన వ్యసనం అత్యంతం అతిశయించినప్పుడు, "ఇక ఈమె జీవించే అవకాశం లేదేమో!" – అనే దశ ఏర్పడినప్పుడు, నాయకి దశ అగ్ని సమక్షంలో కరిగిపోయిన మైనం వలె ఉంటుంది. తరువాత, కొంతసేపటికి, ఆ భగవంతుని స్మరణ వల్ల, ఆ స్వామిని ఏ విధంగానైనా సరే పొందాలి – అనే చాపల్యంవల్ల, ఆమె స్థితి అగ్ని సమక్షంలో కరిగే లక్కవలె అవుతుంది. లక్క, మైనం అనే రెండు అగ్ని సమీపంలో కరిగిపోయేవి అయినప్పటికీ, లక్క కంటే మైనం మెత్తగా ఉంటుంది. అగ్ని ముందు తొందరగా, ఎక్కువగా కరిగిపోతుంది కదా. ఈ తేడాను పురస్కరించుకొని, ఆళ్వార్ నాయకి తల్లి, తన కుమార్తె దశను తెలుపడంకోసం ఒకే గుణాన్ని కలిగిన లక్క, మైనం అనే, రెండు వేరు వేరు ఉపమానాలను ప్రయోగించింది – అని భావించాలి.

ఇందువల్ల, అరైయర్ చేసిన అర్థనిర్వాహంలో కంటే, భట్టర్ చూపిన అర్థనిర్వహణలోనే అధిక స్వారస్యం ఉన్నదని తెలుస్తున్నది.

ఇక్కడ మరొక్క విశేషం కూడా సహృదయ హృదయ భావ్యమైనది ఉన్నది. శ్రీరామాయణ సూక్తిలో శ్రీరామునకు చంద్రుడు, అగ్ని, భూమి అనేవారు ఉపమానంగా చెప్పబడ్డ అలంకార శాస్త్రక్రమ రీత్యా గమనించి చూసినట్లయితే, "ఉపమేయాత్ శత గుణ ముపమానమ్" – ఉపమేయం కంటే ఉపమానం వంద రెట్లు అధిక గుణాన్ని కలిగినదై, అంటే, అధిక గుణాన్ని కలిగినదై ఉండాలి –అనే నియమం ఉన్నది. ఎక్కడైనా కవి ప్రయోగించిన ఉపమాలంకారంలోని ఉపమానం కంటే ఉపమేయానికి అతిశయం ఎక్కువగా ఉంటే, అది ఉపమాలంకార దోషమని అంటారు. ఈ క్రమంలో చూసినప్పుడు, ఇక్కడ, శ్రీరాముని చంద్రుడు, అగ్ని, భూమి – అనే వీరితో పోల్చడం అనేది ఏ విధంగా అలంకారం అవుతుంది. ? ఇక్కడ ఉపమానంగా చెప్పిన చంద్రుడు, అగ్ని, భూమి అనే వీరు భగవంతుని అంశావతారుడైన శ్రీరాముని కంటే గుణాలలో గొప్పవారు కారు కదా. "యద్యత్ విభూతిమత్సత్వం శ్రీమదూర్జితమేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమతేజోం ఽ శసంభవమ్" (అర్జునా! ఈ లోకంలో ఏ వస్తువు అయినా విశేషమైన గుణాన్ని కలిగినదిగా ప్రకాశిస్తున్నది అని అంటే, నా తేజస్సులోని అల్పమైన అంశ వల్ల వాటికి అటువంటి అతిశయం ఏర్పడిందని తెలుసుకో) శ్రీకృష్ణుడు చెప్పాడు కదా. అందువల్ల, ఈ లోకంలో ఏ వస్తువు కూడా, ఏ గుణంలోనూ, పరమాత్మతో సమానం కానప్పుడు, అది అధికమైన గుణం కలిగినది ఏ విధంగా అవుతుంది? కాదు కదా. మరి ఆ విధంగా అయితే, ఇక్కడ నారదుడు చేసినది స్తుతిగా చెప్పగలిగినదా? అని అంటే,

ఇక్కడ ఒక వాస్తవాన్ని గుర్తించాలి. భగవంతుని అతిశయాన్ని ఉన్నది ఉన్నట్లుగా వర్ణించగలగడం కానీ, భగవంతునిలో లేని అతిశయాన్ని ఆరోపించి

చెప్పడం కాదనీ, ఎవరికి సాధ్యం కాని పని. కనుక, వారు వారు తమ తమ శక్తికొద్దీ భగవంతుని స్తుతించడంలో లోటు లేదు కనుక, నారదుని వచనాలు ఒక విధంగా భగవంతునకు ఆనందాన్ని కలిగించేవి కనుక, అవి స్తు తిలోకే పర్యవసిస్తాయి –షఅని భావించడంలో లోటు లేదు.

ఇదే క్రమాన్ని ఇక్కడ అళ్వారుల సూక్తిలో కూడా భావించాలి. ఇక్కడ, ఆళ్వార్ సూక్తిలో ప్రస్తావింపబడిన లక్క, మైనం అనే రెండు వస్తువులు నాయకికి కల, భగవదభినివేశంవల్ల కలిగిన దశావిశేషాన్ని యథాతథంగా తెలుపగలిగినవి కాదు, అవి కొంతవరకు మాత్రమే ఆమె దశను సూచిస్తున్నాయని భావించవలసి ఉన్నది. ఎందుకంటే, ఆమె దశకు కారణమైన భగవంతుని గుణవైభవం కానీ, నాయకికి భగవంతునిపై కల అభినివేశాతిశయం కానీ, ఈ రెండూ వర్ణనాతీతాలే కదా.

ఇక్కడ మరొక్క అద్భుతమైన అంశం కూడా గమనించవలసి ఉన్నది. శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రంలోని నామాలలో "పరర్ధిః" అనే 391 వ నామం నుండి శ్రీరామచంద్రమూర్తి గుణానుభవం ఆరంభమవుతున్నది అని, శ్రీ పరాశర భట్టారకుల వారు తమ భగవద్గుణ దర్పణమనే వివరణంలో " అథ మృతసంజీవనం రామచరితమ్" (ఉండే కొన్ని నామాలలో చనిపోయినవారిని కూడా బ్రతికించగల సంజీవనౌషధం వంటి రామచరిత్ర తెలుపబడుతున్నది) అని అనుగ్రహించారు. ఆ క్రమంలో, మొదటి నామం అయిన " పరర్ధిః" అనే నామాన్ని " సర్వైశ్వర్యాదపి పరాస్య కళ్యాణగుణసమృద్ధి ఇతి పరర్ధిః. పరావస్థస్యాపి హి, రామస్యావర సోమాది దేవగుణైకనిదర్శనం క్రియతే" (అందరినీ నియమించగలిగిన ఐశ్వర్యం అనే శక్తిని కలిగి ఉండడం వల్ల, శ్రీరాముని కళ్యాణ గుణ సంపత్తి చాలా అధికమైనది కనుక, "పరర్ధిః" అనబడుతున్నాడు. అంటే, అందరి కంటే గొప్పదైన సమృద్ధిని కలిగినవాడు– అని భావం. శ్రీరాముడు పరత్వాన్ని కలిగిన భగవత్స్వరూపుడే కనుక, ఆయన కంటే తక్కువవారైన చంద్రుడు, మొదలైన దేవతలు, ఆ శ్రీరాముని

కళ్యాణగుణసమృద్ధిలో, ఒక్కొక్క గుణానికి ఒక్కొక్కరు ఉపమానంగా చెప్పబడుతున్నారు. ) అని వివరించి, దానికి ప్రమాణంగా పైన ప్రస్తావించిన "విష్ణునా సదృశో వీర్యే సోమవత్ ప్రియదర్శనః "అనే శ్రీరామాయణ వాక్యాన్ని ఉదాహరించారు. శ్రీరాముడు సాక్షాత్తు భగవత్ స్వరూపుడే అనే విషయాన్ని నిరూపించడం కోసం" ఏతత్ తదుక్త మవ్యకత్ మక్షరం బ్రహ్మ సంహితమ్, దేవానాం హృదయం సౌమ్య! గుహ్యం రామః పరంతపః" (శ్రీరామాయణం– యుద్ధకాండం– 122– 31) (నాయనా! లక్ష్మణా!శ్రీరాముడు సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపం. అతనిని భక్తి లేనివారు తెలుసుకోలేరు. ప్రకృతి సంబంధం ఆయనలో వికారాన్ని కలిగించలేదు. అతడు, అందరూ దేవతలకు అంతర్యామి.

అతని రహస్యాన్ని తెలుసుకోవడం ఉపనిషత్తుల ద్వారానే సాధ్యం అవుతుంది. అతడు తన శత్రువులకు తాపాన్ని కలిగించగలిగినవాడు) అనే శ్రీరామాయణ శ్లోకాన్ని, శ్రీరాముడు సమస్త కళ్యాణ గుణాకరుడు– అనే విషయానికి ప్రమాణంగా " బహవో నృప! కల్యాణ గుణాః పుత్రస్య సంతి తే" (మహారాజా! ఈ కుమారుడైన శ్రీరామునిలో పలు కళ్యాణ గుణాలు ఉన్నాయి) అనే ఇంకొక శ్రీరామాయణ శ్లోకాన్ని ఉదాహరించారు.

దీనిని బట్టి మనకు ఏమి వ్యక్తం అవుతున్నది? అని అంటే, పైన ఉదాహరించిన శ్రీరామాయణ ప్రమాణంలో శ్రీరామనకు ఉపమానంగా చంద్రుడు మొదలైనవారిని ఒక్కొక్క గుణానికి ఉపమానంగా చెప్పినప్పటికీ, ఆ గుణాలు అన్నిటినీ పూర్తిగా కలిగినవాడు శ్రీరాముడు మాత్రమే అని, ఆ స్వామికి కల అనేక కళ్యాణ గుణాలలో, ఏదో ఒక గుణం, ఏదో కొంతవరకు, ఏదో ఒక వ్యక్తిలో ఉన్నందువల్ల, వాటిని ఇక్కడ శ్రీరామునకు ఉపమానంగా చెప్పడం జరిగింది తప్ప, వాస్తవానికి అవి ఏవి ఉపమానాలు కావు అని, శ్రీరామునకు కల అతిశయించిన గుణవైభవం ఇక ఎవరికి లేదని,

వర్ణించేటప్పుడు ఏదో ఒక ఉపమానాన్ని చెప్పాలి కనుక, ఈ లోకంలో గోచరించే వస్తువులలో, ఏ గుణం ఏ వస్తువులో మిగిలిన వస్తువుల కంటే అధికంగా ఉన్నట్లు గోచరిస్తున్నదో, అ వస్తువును ఇక్కడ ఉపమానంగా చెప్పడం జరిగిందని భావించాలి. అందువల్ల, ఇక్కడ ఉపమేయం అయిన శ్రీరామునకు ఆధిక్యం, ఉపమానాలుగా స్వీకరింపబడిన సమస్త వస్తువులకు తక్కువదనం చెప్పబడినట్లు అయినందువల్ల, ఆలంకారిక ప్రక్రియను అనుసరించి, "ఉపమానోపమేయాల మధ్య సామ్యాన్ని ప్రతిపాదించడంతో పాటు, ఉపమానం కంటే ఉపమేయానికి ఆధిక్యం చెప్పడం" అనే వ్యతిరేకాలంకారం సర్వత్ర భాసిస్తున్నది– అనే విషయం కూడా గమనార్హం.

ఇదే క్రమాన్ని పైన ఉదాహరించిన ఆళ్వారుల సూక్తులు కూడా భావించాలి. పరాంకుశ నాయకి దశకు లౌకిక వస్తువులైన లక్కను, మైనాన్ని ఉదాహరణగా చెప్పినప్పటికీ, అవి ఏదో కొంతవరకు ఉపమానంగా చెప్పదగినవే తప్ప, పూర్తిగా ఉపమానంగా కాదగినవి కాదని, ఎందువల్లనంటే, అవి చైతన్యం కలిగినవి కాదు, అంతేకాక, ద్రవీకరించే స్వభావం ఉపమానంగా చెప్పబడినవాని కంటే, పరాంకుశ నాయకికి అధికం. అందువల్ల, ఇక్కడ కూడా వ్యతిరేకాలంకారం ధ్వనిస్తున్నదని భావించాలి.

ఈ విధమైన పలు అద్భుతవిశేషాలు మనకు పూర్వాచార్యుల వ్యాఖ్యాన సూక్తుల ద్వారా వ్యక్తమవుతున్నాయి. స్వస్తి.

★★★★★

# తిరువాయ్ మొழி – శ్రీరామాయణమ్ – 4

★★★★★

**రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా ।**

**జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా ॥** (బాలకాండ – 1– 26)

శ్రీరామునకు చాలా ఇష్టమైనవి, ఎల్లప్పుడు హృదయంలో నిలుపుకోదగినది, ప్రాణంతో సమానమైనది, భగవంతుని ఎల్లప్పుడూ కోరేది, జనకకులంలో జన్మించినది, దేవ మాయవలె ఉన్నది అయిన సీతాదేవి శ్రీరాముని అనుసరిస్తూ వనానికి వెళ్ళింది.

నారద మహర్షి, వాల్మీకితో శ్రీరామ చరిత్రను సంగ్రహంగా తెలియజేస్తూ, శ్రీరాముడు అరణ్యవాసానికి వెళ్ళినప్పుడు, అతనితో పాటు అతని భార్య సీతాదేవి కూడా వెళ్ళింది – అని చెప్పే సందర్భంలో ఈ శ్లోకం ఉన్నది. దీనిని గోవిందరాజీయ వ్యాఖ్యానం ఈ క్రింది విధంగా వివరించింది.

లక్ష్మీ స్వరూపిణి అయిన సీతాదేవి, జీవుడు భగవంతుని ఆశ్రయించేటప్పుడు పురుషకార రూపంలోనూ, ఆ స్వామికి సేవను చేసేటప్పుడు ప్రాప్యంగాను అన్వయాన్ని కలిగినది కనుక భగవంతునితో ఎల్లప్పుడూ నిత్యయోగాన్ని కలిగినది – అని ద్వయ మంత్రంలో చెప్పబడింది. ఆ విషయమే ఇక్కడ ఈ శ్లోకంలో చెప్పబడుతున్నది. ద్వయమంత్రంలో ఉండే పూర్వ వాక్యం, చేతనుడు భగవంతుని ఆశ్రయించే ప్రకారాన్ని తెలియజేస్తున్నది. అందులోని " శ్రీమన్నారాయణ" అనే మొదటి పదం, లక్ష్మీవిశిష్టుడైన నారాయణుని తెలుపుతున్నది. ఇటువంటి లక్ష్మీ సహితుడైన నారాయణుని ఆశ్రయించమని మొదటి వాక్యం తెలియజేస్తున్నది. ఇక, ద్వయ మంత్రంలోని రెండవ వాక్యం, కైంకర్య ప్రార్థనను చేసే ప్రకారాన్ని తెలుపుతున్నది. ఇందులో మొదట ఉండే "శ్రీమతే నారాయణాయ "అనే రెండు పదాలు, "లక్ష్మీ నారాయణులు అనే దివ్య దంపతుల కలయికలో

సేవను ప్రార్థించా"లని తెలుపుతున్నది. ఈ విధంగా, లక్ష్మీసంబంధం అనేది అశ్రయించే దశలోను, కైంకర్యం చేసే దశలోను, రెండు వేళల అపేక్షితమని, జీవుడు భగవానుని ఆశ్రయించేటప్పుడు, పురుషకార రూపంలోనూ, ఆశ్రయించిన భక్తుడు సేవను చేసేటప్పుడు, ఆ సేవను భగవంతునితో పాటు స్వీకరించేదిగాను లక్ష్మీదేవికి అన్వయం ఉన్నది కనుక, లక్ష్మీ నారాయణుల ఆ నిత్య యోగాన్ని ఈ శ్లోకం సూచిస్తున్నదనే దృష్టితో గోవిందరాజీయ వ్యాఖ్యానం ఈ శ్లోకాన్ని వివరించింది.

(రామస్య) అభిరాముడైన శ్రీరామునకు కూడా, (దయితా) అభిరామ అయినది, (నిత్యం భార్యా) అతనికి ఎల్లప్పుడూ హృదయంలో నిలుపుకోదగినది, ఎందువల్లనంటే, (ప్రాణ సమా) అతనికి ప్రాణంతో సమానమైనది కనుక. (ఈ విధంగా, ఇక్కడ "ప్రాణ సమా" అనే ఈ పదాన్ని హేతు గర్భ విశేషణంగా అన్వయించి, ప్రాణంతో సమానమైనది కనుకనే, సీతాదేవి శ్రీరామునకు చాలా ఇష్టమైనది, ఐతనికి హృదయంలో ఎప్పుడూ ధరించదగినది అయినది – అనే అర్థం ఇక్కడ చెప్పబడింది). (హితా) ఎల్లప్పుడూ చేతనుల హితాన్నే ప్రధానంగా కలిగినది – అని అర్థం. ఈ విషయం, తన విషయంలో చాలా అక్రమంగా ప్రవర్తించి పలికిన రావణుని ఉద్దేశించి కూడా, అతని హితాన్ని కోరి ఆమె, " మిత్ర మౌపయికం కర్తుమ్" అంటూ "రావణా!శ్రీరామునితో కనీసం స్నేహమైనా చేసుకో, బ్రతికి పోతావు" అని హితాన్ని పలికింది కదా.

లేక, (హితా) అనే ఈ విశేషణాన్ని చేతన పరంగా కాకుండా, భగవంతుని పరంగా అన్వయించి, భగవంతుని హితాన్ని ప్రధానంగా కలిగినది– అనే అర్థాన్ని గ్రహించవచ్చు ఈ విషయం, అరణ్యాకాండలో, శ్రీరాముని ఆశ్రిత రక్షణదీక్షాతత్పరతను సీతాదేవి స్థూణానిఖననన్యాయంలో పరీక్షిస్తూ పలికిన "స్మారయే త్వాం, న శిక్షయే" అనే మొదలైన మాటల వల్ల

స్పష్టపడుతున్నది – అనే వేరొక విలక్షణమైన అర్థాన్ని కూడా ఈ వ్యాఖ్యానంలో తెలిపబడింది.

"హితా" అనే ఈ విశేషణానికి చేయబడిన ఈ రెండు విధాలయిన వివరణలు లక్ష్మీ పురుషకారస్వరూపానికి అనుగుణమైనవి, సాంప్రదాయికమైనవి. లక్ష్మీదేవి భగవంతుని ఆశ్రయించగోరిన చేతనుని, భగవానుని, ఇద్దరిని పురుషునిగా చేస్తున్నది కనుక, ఆమెను పురుషకార స్వరూపినిగా శ్రీవైష్ణవ సంప్రదాయంలో భావించడం జరుగుతున్నది. జీవుని పురుషునిగా చేయడం అంటే, "పురు– అగ్రగమనే" అనే ధాతువు నుండి పురుష శబ్దం ఉత్పన్నమైనదని భావించినప్పుడు, పురుషశబ్దానికి "ముందుకు వెళ్లేవాడు, ముందడుగు వేసేవాడు " అని అర్థం. ఆశ్రయించే జీవుని అగ్రగామిగా, అంటే, తాను గతంలో చేసిన పలు పాపాలను చూసి, భగవంతుడు తనను క్షమిస్తాడా? స్వీకరిస్తాడా? స్వీకరించడా ?అనే సంకోచంతో భయంతో వెనుకడుగు వేసే చేతనుని ప్రోత్సహించి, భగవంతుడు కరుణామయుడు, తప్పక క్షమిస్తాడు– అని తగిన హితవచనాలను, భగవంతుని ఆశ్రయించడంలో ఎటువంటి సంకోచం లేకుండా ముందుకు వెళ్లేవానినిగా అతనిని చేస్తున్నది. భగవల్లాభాన్ని జీవులకు కలిగిస్తున్నది. ఈ విధంగా జీవుని విషయంలో ఈమె హితపరురాలు అవుతున్నది.

ఇక, పురుషోత్తముడుగా కీర్తింపబడే భగవంతుని పురుషునిగా చేయడం అంటే ఏమి? అని అంటే, తనను ఆశ్రయించే జీవుని దోషాలను చూచి, భగవానుడు, సహజంగా కరుణామయుడు అయినప్పటికీ, కోపించి అతనిని దూరంగా చేసినప్పుడు, "క ఇహ నిర్దోషః జగతి?" ఈ లోకంలో తప్పు చేయనివాడు ఎవడున్నాడు? నిన్ను ఆశ్రయించే జీవుని అపరాధాలను నీవు లెక్కించ వద్దు అతని విషయంలో కరుణనే చూపాలి "అని ఈ విధంగా తగిన

హితవచనాలను పలికి, జీవుని భగవానుడు క్షమించేటట్లు స్వీకరించేటట్లు చేసి, చేతన లాభం భగవంతునకు కలిగిస్తున్నది. ఈ విధంగా భగవంతుని విషయంలో కూడా ఈమె హితపరురాలు అవుతున్నది. జీవుని కర్మానుసారంగానే అతనికి పలాన్ని ఇవ్వాలి అని భావించే భగవంతుని మనస్సును మార్చి, ఆశ్రయించిన జీవుని విషయంలో అతడు అధికమైన పలాన్ని ఇచ్చేవానినిగా చేస్తున్నది కనుక, అతనిని పురుషునిగా చేస్తున్నది. ఈ అర్థం, "పురు–అధికం, సనోతి ఇతి పురుషః, షణు – దానే" అనే పురుషశబ్ద వ్యుత్పత్తినిబట్టి చెప్పబడింది. ఈ విధంగా, ప్రస్తుత శ్లోకంలో ఉండే "హితా" అని సీతాదేవికి ప్రయోగింపబడిన విశేషణం రెండు విధాలైన అన్వయాన్ని కలిగినదిగా గోవిందరాజీయవ్యాఖ్యానం చూపించింది.

అయితే, ఇక్కడ సందర్భాన్ని గమనించి చూసినప్పుడు, సీతాదేవికి ప్రయోగింపబడిన మిగిలిన విశేషణాలు అన్నీ కూడా శ్రీరాముని విషయంగానే, అంటే, "సీతాదేవి శ్రీరామునకు చాలా ఇష్టమైనది, ఎల్లప్పుడు అతనిచే హృదయంలో ధరించదగినది, ప్రాణ సమానమైనది" అని అర్థాన్ని ఇచ్చే విశేషణాలు అన్నీ, శ్రీరామునితో అన్వయాన్ని కలిగినవిగా వివరింపబడినందువల్ల, మిగిలినది అయిన "హితా"అనే ఈ విశేషణాన్ని కూడా, శ్రీరాముని విషయంగానే అన్వయించి, శ్రీరాముని హితాన్ని కోరేది – అనే అర్థాన్ని ప్రధానంగా గ్రహించడంలో ఒక స్వారస్యం ఉన్నది.

ఇటువంటి అర్థాన్ని గ్రహించి, నంబిళ్ళై, అనే ఆచార్యులు తిరువాయ్ మొழி ప్రబంధం వ్యాఖ్యానంలో ఒక చోట, " "ప్రాణ సమా హితా" అనే ఈ రెండు విశేషణాలను ప్రమాణంగా ఉదాహరించారు. ఈ ప్రమాణాన్ని, సీతాదేవి విషయంలో కాకుండా, సీతాదేవితో అన్ని విధాలుగా సామ్యాన్ని కలిగిన, నమ్మాళ్వారుల విషయంలో, వారు ఆ ప్రబంధంలో నాయకీ భావాన్ని పొందిన సందర్భాన్ని తెలిపే దశకంలో ఉండే ఒక సూక్తిని వ్యాఖ్యానిస్తూ ప్రమాణీకరించారు.

భగవంతుని విశ్లేషం వల్ల కలిగిన ఆర్తిని సహించలేక, " ఆ స్వామిని ఏ విధంగానైనా చేరాలి "అనే ఉత్కటమైన అభిలాష వల్ల, నమ్మాళ్వార్లు నాయికా భావాన్ని పొంది, "మడల్" అనే ద్రావిడ దేశంలో భగ్న ప్రేమికుడు తన మనోరథం ఈడేచ్చుకోవడం కోసం అనుసరించే ఒకానొక ప్రక్రియను తాము ఆచరించడానికి ప్రయత్నిస్తున్నట్లుగా పలికే దశకం, ఇది. ఈ ప్రక్రియను అనుసరించి, తన ప్రేమ ఫలించని ప్రేమికుడు తాటి మట్టతో చేసిన గుర్రం ఆకారంలో ఉండే వాహనం పైన కూర్చుని, తానుండే ఊరిలో అన్ని వీథులలోను తిరుగుతాడు. అతడు ఎక్కిన ఆ వాహనాన్ని అతని స్నేహితులు దారాలతో పట్టి వీధిలో లాగుతూ తీసుకొని వెళతారు. ప్రేమికుడు తన వంటి నిండా బూడిదను పూసుకొని, ఒక తాటి మట్టతో తన శరీరాన్ని కొట్టుకుంటూ, అరుస్తూ, తనకు జరిగిన అన్యాయాన్ని వెల్లడిస్తాడు. అప్పటికీ అతని కోరిక తీరకపోతే, అప్పుడు అతడు ఆ ఊరిలో ఉండే పెద్దల సమక్షంలో గాని, ఆ ఊరిప్రభువు దగ్గర కానీ, తనకు జరిగిన అన్యాయాన్ని నివేదించి, న్యాయాన్ని పొందడానికి ప్రయత్నిస్తాడు. ఇదే మడల్ ప్రక్రియ. ఈ ప్రయత్నాన్ని మగవాడు చేయవచ్చుగాని, కులకాంత చేయరాదు– అనే నిబంధన ద్రావిడ దేశంలో ఉన్నది. కానీ, ఆళ్వారులు ఈ నియమాన్ని కూడా ఉల్లంఘించి, తాము నాయకీ భావాన్ని పొందిన దశలో, భగవంతుని ఉద్దేశించి ఈ మడల్ ప్రయత్నాన్ని చేస్తానని అంటూ భగవంతుని బెదిరిస్తున్నారు.

అయితే, నాయిక ఈ విధంగా ఈ ప్రయత్నాన్ని చేస్తే, నాయకుడైన భగవంతుని గౌరవానికి భంగం కలుగుతుంది అని, ఉత్తమ కుల సంజాతవు అయిన నీకు ఇది తగిన పని కాదని ఆమె తల్లి పరాంకుకుశ నాయకిని ఈ ప్రయత్నం చేయకుండా నివారించడానికి ప్రయత్నిస్తూ వద్దని పలికే సందర్భం ఇది.

ఈ సందర్భాన్ని వివరించేటప్పుడు నంబిళ్ళై తమ వ్యాఖ్యానంలో(5–3–10) పాశురాన్ని వివరిస్తూ, పై శ్రీరామాయణ ప్రమాణాన్ని ఉదాహరించారు. అక్కడ వారు వివరించిన వాక్యాలను గమనిద్దాం. పరాంకుశ నాయకితో ఆమె తల్లి పలికే మాటలు ఇవి.

"ఓ పరాంకుశ నాయకీ! నీవు మడల్ ఎత్తుతానని అంటూ మాట్లాడే ఈ మాట సరి కాదు. మొట్టమొదటగా, స్త్రీలు మడల్ అనే ప్రయత్నం చేయదగినవారు కాదని నిషేధింపబడింది. ఇంతకు మించి, నీవైతే, "నిత్యం ప్రాణసమా హితా" అనే విధంగా, నీకు ఎంత కష్టం కలిగినప్పటికీ కూడా, నాయకుడైన స్వామికి హితాన్ని కలిగించాలని కోరేవారిలో అద్వితీయువు. అతడు కూడా, నీ దగ్గరకు రావడానికి, నీకంటే కూడా ఎక్కువగా తొందరపడే స్వభావం కలిగినవాడు. కాకపోతే, అతడు నీ దగ్గరకు రావటానికి కొంత సమయం పడుతుంది. నీవు ఆ సమయాన్ని సహించ లేకుండా ఉన్నావు, అంతే. ఇందువల్ల నీవు ఈ సాహస కార్యంలో ప్రయత్నం చేయడం ఈ స్వరూపానికి ఎంత మాత్రం తగదుసుమా" అని అంటన్నది, తల్లి.

ఈ వివరణాన్ని గమనిస్తే, ఇక్కడ "హితా"అనే విశేషణాన్ని, వ్యాఖ్యాత, భగవంతుని విషయంగా అన్వయించి, అర్థం గ్రహించినట్లుగా స్పష్టడుతున్నదికదా.

★★★★★

# తిరువాయ్ మొழி – శ్రీరామాయణమ్ – 5

★★★★★

"గుహ మాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్,
గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా" (బాలకాండ–1– 29)

ధర్మాత్ముడైన శ్రీరాముడు నిషాద కులానికి అధిపతి, తనకు ఇష్టమైనవాడు అయిన అయిన గుహునితో కలసి, ఆ విధంగా గుహునితో కలసిన తరువాతనే శ్రీరాముడు లక్ష్మణునితో, సీతతో కూడా కలసినట్లు భావించాడు.

నారద మహర్షి వాల్మీకి మహర్షికి రామచరిత్రను సంగ్రహంగా తెలిపే సందర్భంలో పలికిన వాక్యం, ఇది. శ్రీరాముడు వనవాసానికి బయలుదేరి, , దారిలో తనకు చాలా ఇష్టమైనవాడైన గుహుని కలసి, చాలా సంతోషించాడు. సీతా లక్ష్మణులతో అంతకు ముందు తాను కలసి ఉన్నప్పటికీ, తనకు ప్రియమైన వాడైన గుహునితో కలసిన తరువాతనే, సీతా లక్ష్మణులతో కూడా కలసినట్లు అతడు భావించాడని ఇక్కడ ఈ శ్లోకానికి తాత్పర్యాన్ని మన పూర్వాచార్యులు గ్రహించారు.

గోవిందరాజీయ వ్యాఖ్యానంలో ఈ శ్లోకానికి ఈ విధంగా వ్యాఖ్యానం చేయబడింది.

(గుహేన––ప్రియమ్) "గుహతి – గోపయతి, సంచయతి పరస్వమితి గుహః" అనే వ్యుత్పత్తి ప్రకారం, గుహశబ్దానికి, ఇతరుల సొత్తును దొంగిలించి దాచేవాడు– అని అర్థం. దీనివల్ల, జాతి చేత, గుణం చేత, గుణం కూడా గుహుడు చాలా తక్కువవాడు. ఆ విధంగా అతడు, అన్ని విధాలా చాలా తక్కువవాడు అయినప్పటికీ, తన విషయంలో అతడు చాలా అల్పమైన అనుకూల భావాన్ని కలిగినవాడు అయినందున, తావన్మాత్రాన్నే పురస్కరించుకుని శ్రీరాముడు అతని విషయంలో అత్యంతం ఆదరాన్ని

చూపించాడు– అని తెలుస్తున్నది. ఇక్కడ శ్రీరాముని కళ్యాణ గుణ విశేషాలు వ్యక్తం అవుతున్నాయి. " నిషాదాధిపతి మాసాద్య" అని చెప్పినందువల్ల, శ్రీరాముని సౌశీల్య గుణం చెప్పబడింది. "ధర్మాత్మా" అని శ్రీరాముని నిర్దేశించినందువల్ల, అతనిలోని గొప్పతనం చెప్పబడింది. విధంగా ఇక్కడ గుహుని చాలా తక్కువదనం. రాముని చాలా గొప్పతనం, –©అనే రెండు సూచింపబడ్డాయి. సౌశీల్యం అంటే, చాలా గొప్పవాడు చాలా తక్కువ వానితో మనసులో ఎటువంటి తేడా లేకుండా కలసి మెలసి వర్తించడం. ఇక్కడ శ్రీరాముని ఇటువంటి సౌశీల్య గుణం చెప్పబడింది. "ఆసాద్య" అనే పదప్రయోగం వల్ల, శ్రీరాముడు ఆదరంతో గుహుని దగ్గరకు వెళ్ళాడు –అని తెలుస్తున్నందున, శ్రీరాముడు గుహునితో కలిసేటప్పుడు, మనసులో ఎటువంటి తేడా లేకుండా, హృదయపూర్వకంగా కలిశాడు – అని చెప్పబడింది " "శృంగి బేరపురే గుహమాషాద్య" అని అన్నందు వల్ల, దోష భూయిష్ఠమైన నిషాదుల వాటికను ఎటువంటి సంకోచం మన మనసులో లేకుండా, శ్రీరాముడు ప్రవేశించాడు – అని చెప్పినందువల్ల దోష భోగ్యత్వం అని నిర్వచింపబడిన వాత్సల్య గుణం చెప్పబడింది. అంతే కాకుండా, తాను పూర్వం ప్రసవించిన దూడ విషయంలో కంటే, అప్పుడే ప్రసవించిన లేగదూడ విషయంలో అల్లి ఆవు ఎక్కువ ప్రీతిని ప్రకటించినట్లుగా, ఇక్కడ శ్రీరాముడు, తనను అంతకు ముందు ఆశ్రయించిన సీతాదేవి విషయంలో కంటే, లక్ష్మణుని విషయంలో కంటే, అప్పుడే ఆశ్రయించిన గుహుని విషయంలో ఎక్కువ ప్రీతిని చూపించాడు, కనుక శ్రీరాముని వాత్సల్య గుణంలోని అతిశయితమైన దశ ఇక్కడ సూచింపబడింది.

ఇక శ్లోకంలోని ఉత్తరార్ధంలో, తన పట్ల ఆశాలేశం మాత్రం ప్రదర్శించిన గుహుని విషయంలో శ్రీరాముడు చూపించిన ప్రేమాతిశయం తెలుపబడుతున్నది.

(రామః గుహేన సహితః సన్ లక్ష్మణేన సీతయాచ సహితః) అనే క్రమంలో ఇక్కడ పదాలను అన్వయించుకోవాలి. దీనివల్ల ఏ విశేషార్థం ప్రకాశిస్తున్నది? అని అంటే, గుహుని కలసిన తరువాతనే శ్రీరాముడు లక్ష్మణునితో, తనను ఏ సమయాల్లోనూ విడచి ఉండని, నిత్యానపాయిని అయిన సీతతో కలసి ఉన్నట్లుగా భావించాడు. అందువల్ల, సీతా లక్ష్మణుల సాహిత్యం ఇంతకు ముందే సిద్ధించినప్పటికీ, గుహునితో తాను కలిసే వరకు ఆది శ్రీరాముని మనస్సులో తోచలేదు అని, కనుక అది అసత్సమమేనని, గుహునితో కలసిన తరువాతనే వారితో తాను కలసినట్లుగా శ్రీరాముడు తన మనసులో భావించాడనే విలక్షణమైన అర్థం ఇక్కడ వ్యక్తం అవుతున్నది. ఇందువల్ల, ఇంతకు ముందు తెలుపబడిన శ్రీరాముని వాత్సల్యగుణంలోని అతిశయం ఇక్కడ సూచింపబడింది.

ఈ ఉత్తరార్ధానికి వేరొక విధంగా కూడా కొందరు వ్యాఖ్యానిస్తారు – అని, గోవిందరాజీయ వ్యాఖ్యానంలో ఇంకొక అన్వయం చూపించబడింది. " స రామః లక్ష్మణేన సీతయా చ సహ, గుహేన, హితః, –ప్రహితః, గంగాం తారితః" (ఆ శ్రీరాముడు, సీతాదేవితో లక్ష్మణుతో పాటు గృహుని చేత గంగానదిని దాటింపబడ్డాడు) అనే అర్థాన్ని ఇక్కడ కొందరు చెప్పారు – అని వేరొక అప్రధానమైన అన్వయాన్ని కూడా వ్యాఖ్యాత తెలియజేశారు. ఈ అన్వయం కథాగమనాన్ని సూచిస్తున్నది తప్ప, ఏ విధమైన విశేషమైన అర్థాన్ని తెలియజేయలేదు. అందువల్ల, ఇది అంత పరిగ్రాహ్యామైనది కాదు. అందువల్లనే రెండవ సమన్వయంగా చూపించబడింది.

ఈ శ్రీరామాయణ సూక్తికి గోవిందరాజీయ వ్యాఖ్యానక్రమం ఈ విధంగా సాగింది. ఈ విధంగా గోవిందరాజులు ఈ శ్లోకానికి ఇటువంటి విశేషమైన వివరణ అనుగ్రహించడానికి ఆధారం ఏమంటే, దివ్య సూరుల దివ్యప్రబంధాలలోని సూక్తులకు వ్యాఖ్యానాన్ని అనుగ్రహిస్తూ, మన

పూర్వాచార్యులు ఈ శ్లోకాన్ని ప్రమాణంగా ఉదాహరించి, ఇందులో భాసించే చాలా అందమైన, అవశ్యం జ్ఞాతవ్యాలైన అర్థాలను అనుగ్రహించడమే. ఆ సందర్భాన్ని కొంచెం గమనిద్దాం. ఇంతే కాకుండా ఈ శ్రీరామాయణ సూక్తిని మన పూర్వాచార్యులు సమన్వయించిన వైఖరి కూడా చాలా విలక్షణమైనది. ఒకే ప్రమాణాన్ని మన పూర్వాచార్యులు వేరు వేరు దృక్కోణాలతో, వేరు వేరు సందర్భాలకు సమన్వయం చేస్తారు. ఇది ఒక అపూర్వమైన ప్రక్రియ. దానిని కూడా యథాశక్తి దర్శిద్దాం.

అంత కంటే ముందు, పై శ్రీరామాయణ సూక్తిని కొంచెం గమనించి చూద్దాం. సీతాలక్ష్మణులతో శ్రీరాముడు కలసి ఉన్నప్పటికీ, తనకు ఇష్టుడైన గుహునితో చేరిన తరువాతనే, వారిద్దరితో కూడా కలసినట్లు శ్రీరాముడు భావించాడు – అని ఈ శ్రీరామాయణ సూక్తి తెలుపడంవల్ల శ్రీరాముని వాత్సల్య గుణాతిశయాన్ని సూచిస్తుంది – అని గోవిందరాజీయ వ్యాఖ్యానం వివరించిందికదా. అయితే, ఈ విషయాన్ని మన పూర్వాచార్యులు వేరొక లౌకికోదాహరణంతో కూడా వివరించారు.

లోకంలో ఒక వ్యక్తి తనకు ఆనందం కలిగించే ఒక విషయాన్ని పొందినప్పటికీ, అంతకంటే ఎక్కువ ఆనందాన్ని కలిగించే వేరొక విషయాన్ని పొందాలని ఆశపడి, ఆశపడిన ఆ విషయాన్ని పొందలేక పోతే, అప్పుడు, పూర్వం పొందిన విషయం వల్ల అతడు తృప్తిపడడు, సంతోషించడు. పొందిన ఆ విషయాన్ని పొందినట్లుగాకూడా భావించడు. పొందలేని విషయాన్ని గూర్చే ఆలోచిస్తాడు. ఆ విషయాన్ని పొందినప్పుడు మాత్రమే, ఇంతకు ముందు పొందిన విషయాన్ని పొందినట్లు తలుస్తాడు. ఈ విధంగా అతడు భావించటానికి కారణం, ఆ రెండు విషయాల వల్ల అతడు పొందే ఆనందంలోని తారతమ్యమే.

ఈ రీతిలోనే కాకుండా, వేరొక దృష్టిలో కూడా ప్రస్తుత విషయం సమన్వయం చేయబడింది. లోకంలో ధనలోభం కలిగినవాడు తనకు

లభించినదానితో తృప్తిపడడు. తాను పొందగోరిన దానినిలో లోటు ఉంటే, అతనికి తృప్తి కలుగదు. ఆ లోటు తీరిన తరువాతనే తృప్తి పడతాడు. భగవంతుడు కూడా ఇటువంటివాడే. తాను పొందిన చేతన లాభంతో తృప్తి పడడు. , లోకంలో ఉండే చేతనులందరిని తాను పొందాలని అనుకుంటాడు. అందులోనూ, తనను ఆశ్రయించినవారిని, తనను ప్రేమించేవారిని పొందేవరకు అతనికి తృప్తి కలుగదు. "తాను పొందదలచినవారిని పొందలేనప్పుడు భగవానుడు మనసులో కొరతను కలిగి ఉంటాడు, వారిని పొందగలిగినప్పుడే తృప్తిని పొందుతాడు" – అనే విషయాన్ని వేదమే, " స ఏకాకీ న రమేత" – భగవంతుడు, త్రిపాద్విభూతి అని పేరు పొందిన, చాలా పెద్దది అయిన పరమపదంలో ఎంతో మంది నిత్యుల, ముక్తుల మధ్య తాను ఉన్నప్పటికీ, ఏకాకిగా ఉన్నట్లుగా, ఆనందంతో ఉండడు – అని అన్నది.

ఈ విషయాన్ని శ్రీరామాయణం అన్వయ వ్యతిరేకోదాహరణలతో విశదం చేసింది. ఈ విషయాన్ని కొంచెం చూద్దాం.

అరణ్యకాండలోని 16వ సర్గలోని సూక్తి, ఇది. పంచవటిలో గోదావరి నది తీరంలో లక్ష్మణుని ఉద్దేశించి శ్రీరాముడు " కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన!" (16–40) (లక్ష్మణా! మహాత్ముడైన భరతునితో, వీరుడైన శత్రుఘ్నునితో, నీతోను నేను ఎప్పుడు కలసికోగలను?) అని అన్నాడు. రాముడు పలికిన ఈ మాటలలోని తాత్పర్యాన్ని గోవిందరాజీయ వ్యాఖ్యానం వివరిస్తూ, " భరత సాహిత్యాభావేన విద్యమానాభ్యాం సీతాలక్ష్మణాభ్యా మపి విరహిత మాత్మానం మన్యతే. భరత స్నేహాతిశయ ప్రకారో ౭ యమ్"(భరతునితో కలసి ఉండనందువల్ల, సీతా లక్ష్మణులతో కలసి ఉన్నప్పటికీ కూడా, శ్రీరాముడు వారితో కలసి ఉండనట్లుగానే తనను భావిస్తున్నాడు. శ్రీరాముడు ఈ విధంగా

భావించడం, అతనికి భరతుని విషయంలో ఉండే అతిశయించిన ప్రేమ ప్రకారాన్ని తెలుపుతుంది) అని అన్నది.

తనిశ్లోకి వివరణంలో కూడా " శత్రుఘ్నేన త్వయా చ సహితేన భరతేన కదా సమేష్యామి, సంగతో భవిష్యామీతి యోజనీయమ్. చకారేణ సీతాసముచ్చయః. యావదనురక్తమేళనే ఽ పి ఏకానురక్తవిరహే సర్వానురక్తవిరహ ఇవ ఆర్తిః జాయతే. తస్య ఏకస్యాపి మేళనే అపూర్వసర్వసుహృజ్జనమేళనే ఇవాతిహర్షో జాయత ఇతి. త్వయా చేతి. లక్ష్మణ మేళనస్య సిద్ధేఽ పి అసిద్ధవత్ కథనం భరతశత్రుఘ్న విషయప్రేమాతిశయేనేతి భావః". (శత్రుఘ్నునితో, నీతో కూడిన భరతునితో ఎప్పుడు నేను కూడినవాడను కాగలను? అని పదాలను సమన్వయం చేసుకోవాలి. చకారం చేత శ్లోకంలో చెప్పబడని సీతాదేవి సూచింపబడుతున్నది. తనకు ఇష్టమైన వారిలో, కొందరితో కలసి ఉన్నప్పటికీ, వారిలో ఒకరి దూరంగా ఉంటే, మిగిలినవారికి అందరికీ దూరంగా ఉన్నంత ఆర్త కలుగుతుంది. ఆ ఒక్కని కలయికవల్ల అపూర్వమైన సమస్త సుహృజ్జనులతో కలసి ఉన్నంత గొప్ప సంతోషం కలుగుతుంది. (త్వయా చేతి). లక్ష్మణునితో కలసి ఉన్నప్పటికీ, అతనితో కలసి ఉండనట్లుగా శ్రీరాముడు చెప్పడానికి కారణం ఏమంటే, అతనికి భరత శత్రుఘ్నుల విషయంలో ఉండే అనురాగాతిశయమే) అని అంటూ ఇదే విధమైన వివరణను తెలియజేసింది. తాను కలసి ఉండాలని కోరుకున్న వారికి దూరమైనప్పుడు భగవానునకు కలిగే మానసిక స్థితిని తెలుపుతున్నందువల్ల ఇది వ్యతిరేకోదాహరణం.

అన్వయముఖంలో ఉదాహరణం, ప్రస్తుత శ్రీరామాయణ సూక్తి. ఇందులో, శ్రీరాముడు, తనకు మిక్కిలి ఇష్టమైన గుహునితో కలసిన తరువాతనే, సీతాలక్ష్మణులతో కలసి ఉన్నట్లుగా తనను భావించాడని చెప్పబడింది కదా.

ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, మన పూర్వాచార్యులు ఈ శ్రీరామాయణ సూక్తిని దివ్య ప్రబంధవ్యాఖ్యానాలలో, ఇటువంటి అర్థ సందర్భాలను వివరించేటప్పుడు ప్రమాణంగా ఉదాహరించారు. అయితే, విశేషం ఏమంటే, పైన ప్రస్తావించిన శ్రీరామాయణ సూక్తులు రెండు కూడా భగవంతుని మానసిక దశా విశేషాలను తెలుపుతుండగా, ఆళ్వారుల ప్రబంధంలో ఉండే సూక్తులు వారి మానసిక దశావిశేషాన్ని తెలిపేవి కనుక, దానికి అనుగుణంగా మలచుకొని, సమన్వయిస్తూ ఉదాహరించారు. ఆ సందర్భాన్ని కొంచెం గమనిద్దాం.

అంతకు ముందుగా, వేరొక విషయాన్ని కూడా మనం ఇక్కడ మనస్సులో పెట్టుకోవలసి ఉన్నది. శ్రీ వైష్ణవ సిద్ధాంతంలో, భగవద్భక్తి, భగవదనుభవం ప్రథమ పర్వమని, భాగవత భక్తి, భాగవతానుభవం మధ్యమ పర్వమని, ఆచార్యభక్తి, ఆచార్యానుభవం చరమ పర్వమని, ఈ విధంగా పర్వ త్రయం అంగీకరింపబడింది. ఈ మూడు ఒక చెరకు గడలో ఉండే మూడు కణుపులవంటివి అని చెప్పబడుతున్నది. చెరకు గడలో మొదటి కణుపులో ఉండే మాధుర్యం కంటే రెండవ కణుపులో ఉండే మాధుర్యం ఎక్కువగా, అంతకంటే, మూడవ కణుపులో ఉండే మాధుర్యం ఎక్కువగా ఉన్నట్లే, చెరకు గడలోని కణుపులవంటి భగవదనుభవం, భాగవతానుభవం, ఆచార్యానుభవం – అనే ఈ మూడిటిలో మాధుర్యం ఉత్తరోత్తరం అధికం అని కూడా అంగీకరింపబడింది. ఈ దృష్టిలో ప్రస్తుత శ్రీరామాయణ సూక్తి సమన్వయం చేయబడింది.

**ఇప్పుడు, ఆళ్వారుల సూక్తి నేపథ్యాన్ని గమనిద్దాం.**

నమ్మాళ్వారులు భాగవతానుభవాన్ని పొందలేనందువల్ల తమకు కలిగిన ఆర్తిలోని అతిశయాన్ని నాయికా భావాన్ని వ్యక్తం చేస్తూ, "ఆడి యాడి" (2–4) అనే దశకాన్ని అనుగ్రహిస్తున్నారు. . ఇంతకు ముందు ఆళ్వార్లు,

రెండు దశకాలలో తమకు భగవద్విరహం వల్ల ఏర్పడిన క్లేశాతిశయాన్ని నాయికా భావాన్ని పొంది ప్రకటించారు. ఆ రెండు దశకాలలోను నేరుగా నాయిక మాట్లాడుతున్నట్లుగానే పాశురాలను పలికారు. అయితే, ప్రస్తుతం ప్రసక్తమైన"ఆడి యాడి"(2--4) అనే దశకంలో నాయికా భావాన్ని పొంది పలికినప్పటికీ, నాయిక తన దశను గూర్చి తాను స్వయంగా పలుకకుండా, తన తల్లి మాట్లాడిన మాటల ద్వారా వ్యక్తం చేసిన రీతిలో పాశురాలు గోచరిస్తున్నాయి. ఈ తేడాను సమన్వయం చేస్తూ ఆచార్యులు, తమ వివరణలో డబ్బును పోగొట్టుకున్నవానికి కలిగే దుఃఖం కంటే, బంగారాన్ని పోగొట్టుకున్న వానికి కలిగే దుఃఖం ఎక్కువగా ఉంటుంది, అంతకంటే, మణిని పోగొట్టుకున్నవానికి కలిగే దుఃఖం ఇంకా ఎక్కువగా ఉంటుంది. ఆ విధంగానే, సౌలభ్య గుణం ప్రకాశించే అవతార దశలోని భగవంతుని అనుభవాన్ని పొందాలని ఆశపడి, అది పొందలేనప్పుడు కలిగే దుఃఖం కంటే, అవతార రూపాల కంటే ఎక్కువ సౌలభ్యాన్ని కలిగిన భగవంతుని అర్చారూపంలోని అనుభవాన్ని పొందాలని ఆశపడి దానిని పొందలేనప్పుడు కలిగే దుఃఖం ఎక్కువ అని, ఈ రెండు భగవదనుభవాలే కనుక, వీటి కంటే ఎక్కువ మధురమైన భాగవత సంశ్లేషానుభవాన్ని పొందాలని ఆశపడి ఆ విధంగా దానిని పొందలేనప్పుడు కలిగే ఆర్తి మరింత ఎక్కువ కనుక, ఆ ఆర్తిని ఇక్కడ నాయిక తాను స్వయంగా వ్యక్తం చేయలేక, తన తల్లి మాటల రూపంలో వెల్లడిస్తున్నది. అందువల్ల ఈ దశకంలో వెల్లడింపబడే, ఆళ్వారుల కలిగిన ఆర్తి, పూర్వ దశకాలలో రెండిటిలో వెల్లడింపబడే ఆర్తి కంటే అధికం ఇంతే కాక ఆళ్వార్ నాయికకు ఇంతకు ముందు తాను పొందిన భగవదనుభవం కూడా, మనసులో తోచడం లేదు. ఎందుకంటే, అంతకంటే ఎక్కువ మధురమైన భాగవతానుభవాన్ని ఆమె పొందలేనందు వల్ల. ఇటువంటి ఈ అనుభవ సాదృశ్యాన్ని వివరించడం కోసం నంబిళ్ళై తమ వ్యాఖ్యానంలో పైన ప్రస్తావించిన శ్రీరామాయణ సూక్తిని ప్రమాణంగా ఉదాహరించడం జరిగింది.

ఇది చాలా సూక్ష్మమైన దృష్టితో చేసిన సమన్వయం అనేది దీనిని గమనించినప్పుడు మనకు స్పష్టపడుతుంది.

ఇక్కడ విశేషం ఏమంటే, శ్రీరామాయణ సూక్తికి విషయం, భగవంతుడు తనకు మిక్కిలి ఇష్టమైన భక్తులతో సంశ్లేషాన్ని పొందలేనప్పుడు ఆ స్వామికి కలిగే ఆర్త్యతిశయం కాగా, ఆళ్వార్ల సూక్తికి విషయం, భాగవత సంశ్లేషాన్ని పొందలేనప్పుడు వారికి కలిగిన ఆర్త్యతిశయం.

